# FOREWORD

The history of the kings of the Vishṇukuṇḍin dynasty, who ruled over Coastal Andhra Pradesh for well over a period of two centuries, mark an important epoch in the history and culture of Andhra Pradesh. They succeeded the Ikshvākus of Vijayapuri or Nāgārjunakoṇḍa, as is evidenced from the hoard of their coins recovered by the undersigned in course of excavation works at Yeleswaram. The Vishṇukuṇḍins, like the Ānanda Gōtrins, Śālaṅkāyanas, Bṛhatphalāyanas, revived Hinduism, after a spell of Buddhism, patronized by the queens of their predecessors, the Ikshvākus. It is interesting to note that recently discovered copper plates of Vishṇukuṇḍin Gōvindavarma, from Tummalagudem in Nalgonda district revealed that the early members of the dynasty, like the Ikshvākus, patronized Buddhism as well as Hinduism and constructed temples and viharas. The Vishṇukuṇḍin kings established *ghaṭikāsthānas* (universities of learning) ; excavated cave temples. This in short, is the contribution of the Vishṇukuṇḍins to the culture of Andhra Pradesh.

Historical research has been going on since well over 30 years to write their history by a host of scholars like K. V. Lakshmanarao and M. Somasekhara Sarma, B. V. Krishṇa Rao, K. A. Nilakantha Sastri, V. S. Ramachandramurthy, Prof. V. V. Mirashi, R. S. Panchamukhi, J. Dubreuil, D. C. Sarcar, Prof. Rallabandi Subbarao, Dr. R. Subrahmanyam, Mohd. Abdul Waheed Khan etc. All of them had to face serious problems in fixing up the chronology and genealogy of kings of the Vishṇukuṇḍin dynasty as their copper plates, which were six in number, provided only regnal periods of the donors of the various charters and gave different pedigrees sometimes unconnected with the others. Different genealogical tables have been formulated basing on the common epithets of kings mentioned in their charters, coupled with meagre synchronisms, culled out from the records of Vākaṭakas, Eastern Gāṅgas of Kaḷiṅga, Eastern Chāḷukyas of Veṅgi etc. No two genealogical tables suggested by any scholar agree with the other and so is the case with the chronological arrangement.

The recent discovery of the two sets of copper plates from Tummalagudem in Nalgonda district, belonging to Gōvindavarman and Vikramēndra-bhaṭṭaraka-varman II of the Vishṇukuṇḍin dynasty, opened new vistas in their history. The former was issued in the 37th regnal year of Gōvindavarman and the latter was issued in the 11th regnal year of Vikramēndra-bhaṭṭarakavarman II corresponding to Śaka 488=A.D. 566. Even though scholars expressed relief and satisfaction at the discovery of these copper plate grants they posed more problems, than those that have been solved by them.

In the following pages, Dr. N. Venkataramanayya traced out the history of the Vishṇukuṇḍin dynasty in his own scholarly fashion and has propounded certain theories basing on the evidences from contemporary sources.

Hyderabad,
29-12-1973

MOHD. ABDUL WAHEED KHAN,
*Director*

## PREFACE

The present monograph sums up the results of my study of the Vishṇukuṇḍin history. It began as one of the usual symposia in the Epigraphy section of the Department of Archaeology and Museums, after the publication in the *Bhārati* of the two sets of the Tummalagudem (Indrapalanagar) plates by Śrī B. N. Sastri ; Sarvasri P. V. Parabrahma Sastri, our Assistant Director, S. Dasarathi, the Cataloguer in the State Museum and the Assistant Epigraphists, M.V.N., Aditya Sarma, N. Mukunda Rao and A. Murali Mohan were the other participants in the interminable discussions which went on nearly for an hour to hour and a half every day in the forenoon as soon as we all assembled in the office. Some times the discussions would crop up again during the course of our work in the day. Occasionally, on holidays the discussions took place in No. 14, Readers Quarters, Osmania University Campus, the residence of Dr. R. Subrahmanyam, the then Professor of History in the University, when he and Dr. R. Narasimha Rao, Reader in History in the Arts College, would join us, and help us by their valuable suggestions and criticisms. Each of us approached the problems, specially genealogy and chronology, in his own way. We never reached any agreement. I started to put down my views in writing for clarification, so that the other participants in the discussion may understand them clearly. The result is the present monograph, which I am presenting to the scholarly public interested in the study of Andhra History and Culture. I have chosen Telugu as the medium of my expression, because I could use directly the language of the inscriptions without being put to the necessity of translating it into English. I offer my grateful thanks to the other scholars who joined in the discussion, although the views propounded in the monograph are exclusively mine.

*N. Venkataramanayya*

' HEMAKUTA '
*Vidyanagar, Hyderabad.*
3-8-1970.

## కృతి సమర్పణ

ఈ చారిత్రక గ్రంథకుసుమమును
మహాతపస్సిద్ధులు, వేదధర్మ ప్రవర్తకులు,
కంచికామకోటి పీఠాధిపతులు, పరమహంస,
పరివ్రాజకాచార్య, జగద్గురు,
శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీస్వామివారి
శ్రీ చరణములకు భక్తిభావ పురస్సరముగా
సమర్పించుచున్నాను.

గ్రంథకర్త

# విషయసూచిక



**అనుబంధము :**

## LIST OF PLATES

# విష్ణుకుండినులు

## ప్రకరణము ౧

## ఆధారములు

క్రీ. శ. ఆరంభశతాబ్దములలో వేంగిదేశమును పాలించిన రాజవంశములలో విష్ణుకుండిన వంశ మొక్కటి. సాలంకాయనుల పిమ్మట వీరు ప్రభుత్వమునకు వచ్చిరని చరిత్ర పరిశోధకుల యభిప్రాయము. విష్ణుకుండినచరిత్ర తక్కిన దాక్షిణాత్య ప్రాచీన రాజవంశచరిత్రలవలె వారి శాసనములపై నాధారపడి యున్నది. ఇప్పటివఱకును వీరివి పది శాసనములు లభ్యపడినవి. అందు తొమ్మిది తామ్రపట్టికలు. ఒక్కటి శిలాశాసనము.

౧. ఈపూరు తామ్రపట్టికలు. మొదటిగుది.[1]
౨. ఈపూరు తామ్రపట్టికలు. రెండవగుది.[2]
౩. రామతీర్థ తామ్రపట్టికలు.[3]
౪. చిక్కుళ్ల తామ్రపట్టికలు.[4]
౫. తుండి తామ్రశాసనము.[5]
౬. తుమ్మలగూడెపు తామ్రపట్టికలు. మొదటిగుది.
౭. తుమ్మలగూడెపు తామ్రపట్టికలు. రెండవగుది.[6]

---

1. Ep. Ind. XVII, No. 20, pp. 334–37.
2. *Ibid.* No. 21, pp. 337–39.
3. *Ibid.* XII, pp. 133–36.
4. *Ibid.* Vol IV, pp. 193–98.
5. APGS. No. 8.
6. తుమ్మలగూడెపు తామ్రపట్టికలు రెండు గుదులును భారతి ౪౨ వ సంపుటము 6, 7 సంచికలలో (పుటలు 14-28, 2-14) నింద్రపాలనగర తామ్రశాసనము లను పేర ప్రకటింప బడినవి. కాని ఇంద్రపాలనగర మను స్థలము శాసనములందెందును గానరాదు. అట్టి నగరమొకటి యుండెనని రుజువు సేయగలసాక్ష్యము మృగ్యము. తుమ్మలగూడెపు రెండవ గుదిలో నింద్రపుర మనుచోట విష్ణుకుండిన మహారాజగు గోవిందవర్మయొక్క యగ్రమహిషియగు పరమభట్టారికామహాదేవి బౌద్ధభిక్షుల కొఱకు తనపేర మహాదేవీవిహారమును నిర్మించెననియు, నదేశాసనమున మఱియొక తావున నుత్తమాశ్రయనృపాలుడు శక్రాభిధానపురమునకు వచ్చినపుడు సదరు దానశాసనము నిచ్చెననియు జెప్పియున్నది. శక్రాభిధానపుర మింద్రపురమునకు నామాంతరమగునేమొ. అవి రెండును గుంటూరు మండలములోని యమరావతియనియే తోచుచున్నది. పై రెండు శాసనములును నల్లగొండ జిల్లా రామన్నపేట తాలూకా యందలి తుమ్మలగూడెమను గ్రామమున లభించుట వలన వీని నా గ్రామనామముతోడనే పేర్కొనుట యుక్తమని తలచి యట్లు చేసితిని.

౮. పులుంబూరు తామ్రశాసనము.[1]

౯. ఖానాపూరు తామ్రపట్టికలు.[2]

ఇవిగాక విష్ణుకుండిన వంశమునకు సంబంధించిన శిలాశాసన మొక్కటి కలదు. ఇది గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకా వేల్పూరు గ్రామముననున్నది.[3]

శాసన విషయ సంగ్రహము

*౧. ఈపూరు తామ్రపట్టికలు, మొదటిగుది.*

ఇది గుంటూరు జిల్లా తెనాలి తాలూకా ఈపూరు గ్రామమున లభించినది. ఇందలి వంశక్రమ మిట్లున్నది:-

మహారాజ శ్రీగోవిందవర్మ.

(ఇతడు భగవచ్ఛ్రీ పర్వతస్వామి పాదానుధ్యాతుడు; ప్రణత సకలసామంతుడు. అనేక గో హిరణ్య భూప్రదాత).

మహారాజ శ్రీమాధవవర్మ.

ఇతడు సకలమహీమండలమనుజపతిప్రతిపూజిత శాసనుడు; తన నయబలముచేత జయింపబడిన సకలసామన్తాతులబలవినయ నయ నియమ సత్వసంపన్నుడు. త్రివరనగర భవనగత యువతీహృదయ రంజనుడు. అగ్నిష్టోమ సహస్రయాజి. హిరణ్యగర్భ ప్రసూతుడు; ఏకాదశాశ్వమేధావభృథావధూతజగత్కల్మషుడు. సుస్థిరకర్ముడు. కుఱావాడ విజయస్కన్ధావారమునందుండి మాధవవర్మ గుద్దాది విషయములోని విలెంబలి గ్రామవాస్తవ్యులకు తాను ఆ గ్రామమును దనవంశ విభూత్యర్థము వత్సగోత్రజుడైన అగ్నిశర్మ యను బ్రాహ్మణునకు దానముజేసినట్లు తెలియజేసెను. ఈ శాసనమునకాజ్ఞప్తి మాధవవర్మ యొక్క ప్రియపుత్రుడైన మఞ్చ్యణ భట్టారకుడు. ప్రవర్ధమాన విజయరాజ్య వర్షము 37, గ్రీ. 7 పక్షు, 15 దినము దానశాసనకాలము.

*౨. ఈపూరు తామ్రపట్టికలు, రెండవగుది.*

ఇదియు మీది శాసనమువలె ఈపూరునందే దొరకెను. ఇందు వంశానుక్రమణిక యిట్లు కలదు.

1. Bhārati. VII No. 8, and VIII. pp. 302–315.
2. Ep. Ind. XXVII. No. 49, pp. 312.
3. AR. No. 350 of 1937–38.

మహారాజ శ్రీమాధవవర్మ.
(ఇతడు ఏకాదశాశ్వమేధావభృథావధూత జగత్కల్మషుడు,
అగ్నిష్టోమ సహస్రయాజి, అనేకసామన్తమకుట
కూటమణిఖచితచరణయుగళకమలుడు).

దేవవర్మ

...శ్రీమాధవవర్మ
(ఇతడు త్రికూట మలయాధిపతి, నయవినయ సత్వసం
పన్నుడు, భగవచ్ఛ్రీపర్వతస్వామి పాదానుధ్యాతుడు.)

ఈ శాసనము అమరపురమునుండి ప్రకటింపబడెను. అగ్నిశర్మ ఇంద్రశర్మలను బ్రాహ్మణులకు జేసిన భూదానమును దెల్పుట కిది వ్రాయబడెను.

ఆజ్ఞప్తి. 'అస్య శాసనస్యాజ్ఞా విష్ణుకుణ్ద్యధిరాజధ్యానోదాత్తా' అని యున్నది. ఇందేదో తప్పుదొరలినట్లున్నది.

దానశాసనకాలము ప్రవర్ధమాన విజయరాజ్య వర్షము 47.

*౩. రామతీర్థ శాసనపట్టికలు.*

ఇందలి వంశానుక్రమణిక మాధవవర్మ తోడ ప్రారంభమగుచున్నది.

శ్రీమన్మహారాజ మాధవవర్మ

ఇతడు శ్రీపర్వతస్వామి పాదానుధ్యాతుడు. సకలమహీమణ్డలావనతసామన్తమకుటమణి కిరణావలీఢ చరణయుగళుడు. ఏకాదశాశ్వమేధావభృథావధౌతజగత్కల్మషుడు. క్రతుసహస్రములొనర్చి యవభృథస్నాన పుణ్యోదకముచే పవిత్రము సేయబడిన శిరముగలవాడు.

విక్రమేన్ద్రాఖ్యరాజు

ఇతడు సత్పుత్రుడు, మాతాపితృపాదానుధ్యాతుడు, ఉభయవంశాత్మజాలంకారభూతుడు.

ఇన్ద్రవర్మాఖ్యరాజు

ఇతడు చతురుదధిన్నృపతిమకుట మణిమయూఖవిచ్ఛురితపాదాంబురుహుడు, పరమమాహేశ్వరుడు, అనేక చాతుర్దన్తసమరశతసంఘట్ట విజయుడు.

ఇంద్రవర్మ పురనిసజ్జమవాసకమున నివసించుచున్నప్పుడు విజయరాజ్య సప్తవింశతి (27) వర్ష మున మాండిరసగోత్రోద్భవుడును తైత్తిరీయబ్రాహ్మణుడునైన నాగశర్మకు ప్రకిరాష్ట్రాన్తర్గతమైన పేరువాటకగ్రామమును దానము జేసెను.

౪. చిక్కుళ్లతామ్రపట్టికలు.

ఇందలి వంశానుక్రమణికయు మీది శాసనములవలె మాధవవర్మ తోడనే ప్రారంభమగుచున్నది.

మహారాజ మాధవవర్మ.

ఇతడు భగవతః శ్రీపర్వతస్వామి పాదానుధ్యాతుడు. విష్ణుకుండినులలో నేకాదశాశ్వమేధావభృథావధౌత జగత్కల్మషుడు. క్రతుసహస్రయాజీ. సర్వమేధావభృథావాప్తసర్వభూతస్వారాజ్యుడు. బహుసువర్ణ పౌండరీక పురుషమేధ వాజపేయ యూద్యషోడశ రాజసూయ ప్రాధిరాజ్య ప్రాజాపత్యా ద్యనేక వివిధ పృథుగురువరశతసహస్రయాజీ. క్రతువరానుష్ఠానాధిష్ఠిత ప్రతిష్ఠితపరమేష్ఠిత్వము గలవాడు. మహారాజు. సకల జగన్మణ్డల విమలగురుపృథుక్షితిపతిమకుట మణిగణ నికరావనతపాదయుగళుడు.

విక్రమేన్ద్రవర్మ

ఇతడు విష్ణుకుండి వాకాటక వంశద్వయాలంకృత జన్ముడు.

మహారాజశ్రీ ఇన్ద్రభట్టారకవర్మ

ఇతడు స్ఫురన్నిస్త్రింశప్రభావభాసితాశేష జగన్మండలాధిష్ఠితుడు. భ్రూభంగకరవినిర్ధూత సమగ్రదాయాదుడు. అనేక చాతుర్దన్త సమరసంఘట్ట ద్విరదగణ విపుల విజయుడు. యథావిధి వినిర్మాపిత ఘటికావాప్త పుణ్యుడు. సతతభూమిగోకన్యాహిరణ్యప్రదానప్రతిలబ్ధ పుణ్యాజీవితోపభోగ్యుడు. పరమమాహేశ్వరుడు. మహారాజు.

---

?

మహారాజ విక్రమేన్ద్రవర్మ

ఇతడు శైశవమునుండి సకల గుణాలంకృతుడు. సమగధ్యారోపిత సకలరాజ్యభారము గలవాడు. పరమమాహేశ్వరుడు.

ఈశాసనము విక్రమేన్ద్రవర్మ తెందులూర ఆవాసము నుండినప్పు డిచ్చెను. నతపాట్యందు కృష్ణబెణ్ణాతటమందలి రావిరేవ గ్రామమునకు దక్షిణ పూర్వదిశయందుండు రేగోన్ట గ్రామమును భగవత్సోమగిరి నాథునికి విజయరాజ్య దశమ వర్షమున దత్తము జేసెను.

*౫. తుండి తామ్ర శాసనము.*

పై శాసనములవలె నిందును వంశానుక్రమణిక మాధవవర్మ తోడనే ప్రారంభమగుచున్నది

మహారాజశ్రీ మాధవవర్మ

ఇతడు శ్రీపర్వతస్వామి పాదానుధ్యాతుడు. ఏకాదశాశ్వమేధావభృథావధౌత జగత్కల్మషుడు. క్రతుసహస్రయాజి. సర్వమేధావాప్త సర్వభూతస్వారాజ్యుడు. బహుసువర్ణకాదశకయాజి. ఏకాదశ పౌండరీక ప్రాప్తసర్వార్థుడు. యథావిధ్యనుష్ఠితరాజసూయోపాదితాధిరాజు. పురుషమేధాద్యశేషక్రత్వనుష్ఠానజనిత పరమేష్ఠి. దేవాదిదేవుడు.

మహారాజశ్రీ విక్రమేన్ద్ర భట్టారకవర్మ

ఇతడు విష్ణుకుండివాకాటకవంశద్వయాలంకృత జన్ముడు. సకలసామన్తమంజరీపింజరిత చరణయుగళుడు.

మహారాజేన్ద్ర భట్టారకవర్మ

ఇతడు సమాఘ్రా(ఘ్రా)తమాత్రత్రస్త కాందిశీభూత విశీర్ణ ప్రనష్టాశేషదాయాదుడు. స్వదక్షిణైక బాహుసహాయోచ్ఛ్రిత స్వయం సంక్రమాధిగతాధిరాజ్యుడు. అనేక చాతుర్దన్తసమర సంఘట్ట విజయుడు. పరమమాహేశ్వరుడు. పరమభట్టారకుడు. పరమబ్రహ్మణ్యుడు. యాథావిధి నిర్మాపిత ఘటికావాప్త పుణ్యసముచ్చయుడు. ధర్మవిజయి.

విక్రమేన్ద్ర భట్టారకవర్మ

ఇతడు విష్ణుకుండ్యన్వయమకుటచూళామణి. సకలభువనరక్షాభరణైకాశ్రయమహనీయ గుణుడు. మహీమహేన్ద్రుడు.

ఈ విక్రమేన్ద్ర భట్టారకవర్మ ఆకివాస్తవ్యుడును కౌండిన్యసగోత్రుడును నాపస్తంబసూత్ర పారంగతుడును నైన రుద్రశర్మ యొక్క కుమారుడు స్వామిశర్మకు చెయ్యారకరెలోని తుండి గ్రామమును నిజవిజయరాజ్య చతుర్దశ (౧౦ + ౪) వత్సరమున దానము జేసెను.

*౬. తుమ్మలగూడెపు తామ్రపట్టికలు, మొదటిగుది.*

ఇందువర్ణించియుండు వంశానుక్రమణికయందు మూడుతరముల రాజులు జేర్కొనబడియున్నారు.

మహారాజేన్ద్రవర్మ

మహారాజశ్రీ మాధవవర్మ

మహారాజశ్రీ గోవిన్దవర్మ

ఈ గోవిన్దవర్మ స్వభుజబలోత్సాహ ప్రభావానురాగావ్యాప్తస్వరాజ్యముగలవాడు. అన్య సామన్తాక్రాన్త రాజ్యాన్తరుడు. అనురక్త వర్ణాశ్రమస్వజన పరిజనుడు. గ్రామక్షేత్రహిరణ్య ద్విరదతురగగో బలీవర్దశయ నాసనయాన పాన భోజన భాజన భవనవసనాభరణ కన్యాదాసీదాస సహస్రములను దానముజేసిన వదాన్యుడు. అనేక దేవాయతన విహార సభాప్రపా తటాకోదపానారామప్రతి సంస్కారపూర్వకరణముచే నలంకరింపబడిన సకల దిగన్తరములు గలవాడు. భిక్షుద్విజానాథ యాచకవ్యాధిత దీనకృపణజనోపభుజ్యమాన న్యాయాధిగత విభవధనసముదయముగలవాడు. సర్వస్వత్యాగి. సకల శాస్త్రార్థశ్రవణ పరిజ్ఞానాదిహపరత్ర చానన్య చక్షుడు. విద్వచ్చూర మహాకులీనజనసమాశ్రయుడు. సకల సత్వధాతుత్రాణాయోత్పాదిత మహాబోధిచిత్తుడు.

ఇతడు తన ప్రవర్ధమానవిజయ రాజ్యసప్తత్రింశ (37వ) సంవత్సరమున వైశాఖ పౌర్ణమినాడు చాతుర్దశార్య బౌద్ధభిక్షు సంఘము కొఱకు తన యగ్రమహిషి పరమమహాదేవి యొక్క విహారమునకు దీప ధూపగన్ధపుష్పధ్వజపానభోజనశయనాసనగ్లానభైషజ్యఖణ్డస్ఫుటిత శీర్ణసంస్కారాదులకు పెణ్కపఱ అను పేరుగల గ్రామమును దానము జేసెను.

*౬. తుమ్మలగూడెపు తామ్రపట్టికలు, రెండవగుది.*

ఇందలి వంశానుక్రమణికయం దైదు తరముల రాజులు పేర్కొనబడియున్నారు.

ప్రారంభ శ్లోకమందు సత్యాశ్రయుని పుత్రుడైన యుత్తమాశ్రయుడు విజయమందుగాక యని చెప్పియున్నది.

వంశానుక్రమణిక వివరణ మిట్లుకలదు.

మహారాజశ్రీ గోవిన్దవర్మ

ఇతడు షడభిజ్ఞుని ప్రాతీహార్య దర్శనానుగ్రహ జనిత సుగత శాసనాభిప్రసాదుడు. మహావిహార ప్రతిష్ఠాపనాధిగత అనన్త బ్రహ్మపుణ్య సంభారుడు.

మహారాజశ్రీ మాధవవర్మ

ఇతడు బహుసువర్ణ పౌండరీకవాజపేయ క్రతుసహస్ర సర్వమేధరాజసూయ పురుషమేధా ద్యాహరణ సమ్యగనుష్ఠిత శ్రుతివిహితాశేషదుష్కరకామ్య కర్మానుష్ఠానుడు. ప్రాగ్దక్షిణాప రాంభోనిధి రేవా సలిలవలయ విభూషితమైన భూమికి భర్త.

మహారాజశ్రీ విక్రమేన్ద్రవర్మ

ఇతడు వాకాటక మహాదేవీ సుతుడు. మహాకవి. పరమసౌగతుడు.

## శ్రీ ఇన్ద్ర భట్టారకవర్మ

ఇతడు అనేక చాతుర్దన్త విజయాధిగతాశేష చక్రవర్తిక్షేత్రాధిపతి. విధ్వస్తాశేషదాయాద మండలుడు.

## శ్రీమాన్విక్రమేన్ద్ర భట్టారకవర్మ

ఇతడు ప్రకృతి మండలముచేత శైశవమునందే ఆరోపితరాజ్యభారుడు. పరమధార్మికుడు. ధర్మవిజయి. ప్రణతానేకసామన్తమకుటమణిమయూఖోద్భాసిత చరణయుగళుడు.

ఈ విక్రమేన్ద్రభట్టారకవర్మ తన ౧౧-వ విజయరాజ్యవర్షమున, కార్తికమాస కృష్ణపక్షాష్టమి నాడు అన్యరాజవంశ పృథివీపతి పదప్రసహ్యాహరణ వ్యక్తనిరతిశయ మహిమ గలవాడును, నయ పరాక్రమాదిగుణ సందోహయుక్తుడును, మనోహరస్వరూపము గలవాడునునగు మాధవవర్మ యను పుత్రుని గనినదియు, ననేక సామన్తకులతిలకాయమానమైన విష్ణుకుండికుల బహుమతైక సంబంధితాభిఖ్యాత మాహాత్మ్యముగల పృథ్వీమూల రాజవంశమందు సాగరమందు శ్రీవలె నుత్పన్నమైనదియు, నతిబహుప్రకారమనోరమోదార కర్మాద్భుతస్తూప విహారములచే దక్షిణాపథమందలి ప్రతి విషయమును నలంకరించిన వాడును, శ్రీపార్వతేయ పూర్వాపరక్షితిపతి పరంపరాహారములమధ్య కౌస్తుభమణివలె ప్రకాశించు యశస్సు గల వాడును, గుణరూప సంపదలచేత గోవిందు(విష్ణు)ని బోలినవాడునునగు గో(వి)ంద రాజునకు మూర్తీభవించిన సిరి వలె నందరాని మనోరథములను సిద్ధింపజేయునదియు నగు పరమభట్టారికా మహావిహారమందు చాతుర్దశార్య వర భిక్షు సంఘము యొక్క పరిభోగార్థము ఇరున్డేరు అను పేరుగల గ్రామమును దానము జేసెను.

శాసనాంతమున దానఫలాదికములను దెల్పు శ్లోకముల తరువాత మఱికొన్ని విశేష చరిత్రాంశములు వివరింపబడినవి.

ఉత్తమాశ్రయనృపాలుడు అనగా విక్రమేంద్రభట్టారకుడు చిగురుటాకువలె పేలవమైన బలము గల సింహవ్యాయుని పల్లవుని భంగపఱచి వెనుదిరిగి శక్రాభిధానపురమునకు ప్రథమము వచ్చినంతటనె శకపతి వర్షము ౪౮౮లో నీశాసనమునిచ్చెను. ఎవని నయ విక్రమముల వలన అధఃపతనమై పోవుచుండిన నిజభర్తృకుల లక్ష్మి యుద్ధరింపబడెనో యాసుప్రసిద్ధ రాజశ్రేష్ఠుడైన మూలరాజు (దీనికి) ఆజ్ఞప్తి.

ఇందు వంశానుక్రమణికలో బేర్కొనబడిన రాజులేవురే కాక దానభాగమున గో(వి)న్దవర్మ మాధవవర్మనామధేయులైన మఱియిద్దఱు రాజులును, గోవిన్దవర్మ యొక్క పత్నియు మాధవవర్మ యొక్క తల్లియునైన పరమ భట్టారికామహాదేవియు బ్రస్తుతింపబడియున్నారు. శాసనదాతయగు రెండవ విక్రమేన్ద్రభట్టారకునికిని వీరికిని గల సంబంధమెట్టిదో వివరించి యుండలేదు. కాని వీరును విష్ణుకుండిను లనుటకు సంశయములేదు. పరమభట్టారికామహాదేవి జన్మమందిన పృథ్వీమూల రాజవంశము విష్ణుకుండికుల

బహుమతైక సంబంధితాభిఖ్యాత మహాత్మ్యము గలదనుట ఇచట సంస్మరణీయము. ఇందువలన నామె పుట్టినది పృథ్వీమూల రాజవంశమనియు మెట్టినది విష్ణుకుండినవంశమనియు దెల్లమగుచున్నది. అగునేని వీరెవ్వరు ? విక్రమేంద్రవర్మ పై జెప్పిన పరమమహాదేవి కట్టించి నెలకొల్పిన విహారమున కేల దానము జేసెను ? అను ప్రశ్నలు రెండును సమాధానము కోరుచున్నవి. పై గోవిందవర్మయు నతని పుత్రుడైన మాధవరాజును అన్యులుగారు. విక్రమేన్ద్రుని పెద్దలే. ఆతని వంశమునకాద్యులే. వంశానుక్రమణికయందు పేర్కొనబడిన ప్రథమద్వితీయపురుషులే.

౮. పులుంబూరుతామ్రశాసనము.

ఇందలి వంశక్రమమిట్లున్నది.

శ్రీ విక్రమహేన్ద్రవర్మ

ఇతడు శ్రీపర్వతస్వామి పాదానుధ్యాతుడు. ఉపనత సామన్తమనుజపతి మండలుడు.

గోవిన్దవర్మ

అనేక సమర సంఘట్టన విజయుడు. పరనరపతి మకుట మణిమయూఖ చరణయుగళుడు. విక్రమాశ్రయుడు.

మహారాజమాధవవర్మ

ఇతడు దశశత సకల ధరణీతలన్నృపతి. అవసిత వివిధ త్రివరనగర భవనగత యువతీజన విహరణ రతుడు. క్రతుసహస్రయాజి. హిరణ్యగర్భప్రసూతుడు. ఏకాద శాశ్వమేధావ భృథస్నాన విగత జగదేకస్కుడు. విద్వద్విజ గురువృద్ధతపస్వి జనాశ్రయుడు. మహీతల నృపతి భాస్కరుడు. పరమబ్రహ్మణ్యుడు. మాతాపితృ పాదానుధ్యాతుడు. జనాశ్రయ మహారాజు.

ప్రాగ్దిగ్విజయము జేయదలపెట్టి గోదావరీనదిని దాటినవాడై వేదవేదాంగవిదుడైన రుద్రశర్మ యొక్క మనుమడును, దామశర్మయొక్క పుత్రుడును, గౌతమసగోత్రుడును, కర్మరాష్ట్రములోని కుణ్డూరు వాస్తవ్యుడును నైన శివశర్మయను తైత్తిరికసబ్రహ్మచారికి ఫాల్గుణ పౌర్ణమాస్యనాడు సోమరాహుసగ్రహ నిమిత్తము గుద్దవాది విషయమందు దళియవావితీరమున పులుంబూరు గ్రామమును మయిన్దవాటికి దక్షిణమున సీమాన్తమందు నాలుగు నివర్తనల క్షేత్రముతోగూడ తన ౪౭వ రాజ్యవర్షమున దానము జేసెను.

౯. ఖానాపూరు తామ్రపట్టికలు.

ఈశాసనముయొక్క మొదటిరేకు నష్టమైపోయినది.

మహారాజు మాధవవర్మ

ఇతడు సార్వభౌముడు. పుండరీకబహుసువర్ణైకాదశయాజి. చాతుర్వర్ణ్య చాతురాశ్రమ్య ధర్మకర్మ సేతు బిరుదాంకితుడు.

కృష్ణబేణా పూర్వదక్షిణ భాగమందుండు రెట్టూరుక యను గ్రామమును వంకతీర్థ తంబతీర్థ కదంబతీర్థములను తీర్థత్రయము తోడను బెలవాటి కోలివాటిక వట్టారికలను గ్రాసగ్రామత్రయముతోడను సాలంకాయనగోత్రుడైన బోలస్వామికిని భారద్వాజగోత్రుడైన కేశవస్వామికిని దానము జేసెను.

ఈ మాధవవర్మ యొక్క వంశమెద్దియో పూర్వికులెవ్వరో తెలియదు. ఇతడు పుణ్డరీక బహుసువర్ణైకాదశయాగములు జేసినట్లు చెప్పియుండుటవలన పౌణ్డరీక బహుసువర్ణైకాదశాశ్వమేధ యాజియైన విష్ణుకుండిన మాధవవర్మయే యతడగునని కొందరూహించుచున్నారు. ఇది వాస్తవమే కావచ్చును.

౧౦. వేల్పూరు శిలాశాసనము.

ఇది తునకలైపోయినది. అక్షరములు మాసిపోయినవి. అందందు శిథిలము గానిపట్ల విష్ణుకుండిన వంశము పల్లవకులము అను మాటలును; మాధవవర్మ తన ౩౩-వ రాజ్యవర్షమున విక్రమేంద్రునితో గూడ వేల్పూరుస్కంధావారమున విడిసి యుండగా నేమో చేసినట్లు చెప్పియున్నది.

---

## ప్రకరణము ౨

## వంశానుక్రమణిక

మీది ప్రకరణమున బేర్కొనిన శాసనములలో వర్ణించియుండు వంశావళులను నందలి రాజులయొక్క బిరుదులను ఘనకార్యములను విడిచిపెట్టి సంగ్రహముగ నిట్లు విరచించనగును:—

౧. ఈపూరు, మొదటిగుడి.

మహారాజశ్రీగోవిన్దవర్మ

మహారాజశ్రీమాధవవర్మ

మఞ్చ్యణభట్టారకుడు.

౨. ఈపూరు, రెండవగుడి.

మహారాజశ్రీ మాధవవర్మ

శ్రీదేవవర్మ

... శ్రీమాధవవర్మ

౩. రామతీర్థం.

శ్రీమన్మహారాజ మాధవవర్మ

విక్రమేన్ద్ర(రాజా)

ఇంద్రవర్మ (రాజా)

౪. చిక్కుళ్ల.

మహారాజ మాధవవర్మ

విక్రమేన్ద్రవర్మ

మహారాజశ్రీఇన్ద్రభట్టారకవర్మ

---

మహారాజ విక్రమేన్ద్రవర్మ ?

౫. తుండి.

మహారాజశ్రీ మాధవవర్మ

మహారాజశ్రీ విక్రమేన్ద్రభట్టారకవర్మ

మహారాజేన్ద్రభట్టారకవర్మ

విక్రమేన్ద్ర భట్టారకవర్మ

౬. తుమ్మలగూడెం, మొదటిగుది.

మహారాజేన్ద్రవర్మ

మహారాజశ్రీమాధవవర్మ

మహారాజశ్రీ గోవిన్దవర్మ

౭. తుమ్మలగూడెం, రెండవగుది.

మహారాజ శ్రీగోవిన్దవర్మ

మహారాజ శ్రీమాధవవర్మ

మహారాజ శ్రీ విక్రమేన్ద్రవర్మ

శ్రీ ఇన్ద్రభట్టారకవర్మ

శ్రీమాన్విక్రమేన్ద్రభట్టారకవర్మ

౮. పులుంబూరు.

విక్రమహేన్ద్రవర్మ

గోవిన్దవర్మ

మహారాజమాధవవర్మ

౯. ఖానాపూరు.

మహారాజ మాధవవర్మ

౧౦. వేల్పూరు.

గోవిన్దవర్మ
?
మాధవవర్మ
?
విక్రమేన్ద్ర.

పై పేర్కొనిన (౪) చిక్కుళ్ల (౫) తుండిశాసనములొక్క రాజువే. వానియందలి వంశావళియు నొక్కటే. ఈ శాసనముల నొసగిన విక్రమేన్ద్రవర్మ ఇన్ద్రభట్టారకవర్మ యొక్క పుత్రుడు, విష్ణుకుండి వాకాటక వంశద్వయాలంకరిష్ణుడైన విక్రమేన్ద్రవర్మ యొక్క పౌత్రుడు. ఏకాదశాశ్వమేధాది యాగములను లెక్కింటని గావించిన మాధవవర్మ యొక్క ప్రపౌత్రుడు. ఈ రెండుశాసనములతో గూడ తుమ్మల గూడెపు రెండవగుదిని(౬)సమకూర్చుకొనదగును. ఏలనగా నీ ధర్మశాసనము నిచ్చిన విక్రమేన్ద్ర భట్టారకుడును పై రెండు శాసనముల దాతయైన విక్రమేన్ద్రుని వలెనే ఏకాదశాశ్వమేధాద్యనేకక్రతుకర్తయైన మాధవ వర్మ యొక్క మునిమనుమడు; వాకాటక మహాదేవీసుతుడైన విక్రమేన్ద్రవర్మ యొక్క మనుమడు; ఇన్ద్రభట్టారకవర్మ యొక్క కుమారుడు. పై రెండు శాసనములలోని వంశానుక్రమణిక మాధవవర్మతో నారంభమగుచుండగా నిందు మాధవవర్మ తండ్రియైన గోవిందవర్మతో నుపక్రమించుచున్నది. పై రెండు శాసనములందును నాల్గు తరముల రాజులుపేర్కొనబడియుండగా నిందైదు తరములవారు లెక్కింప బడియున్నారు.

రామతీర్థశాసనము(౭)గూడ నీకోవకు జెందినదే. ఆ శాసనదాతయగు నింద్రవర్మ ఉభయ (విష్ణు కుండి వాకాటక) వంశాత్మజాలంకారభూతుడైన విక్రమేంద్రుని పుత్రుడు; ఏకాదశాశ్వ మేధాద్యనేకయాగ కర్తయైన మాధవవర్మ యొక్క పౌత్రుడు. అనగా నీ యింద్రవర్మ చిక్కుళ్ల, తుండి, తుమ్మల గూడెపు రెండవ గుదుల దాతయైన విక్రమేంద్ర భట్టారకుని తండ్రియని తెలియుచున్నది. పై నాల్గు శాసనములలో వంశానుక్రమణికల నేకీకరణము సేయగా నీ క్రిందియైదు తరముల వంశవృక్ష మేర్పడుచున్నది.

1. మహారాజశ్రీ గోవిన్దవర్మ

2. మహారాజ శ్రీమాధవవర్మ

3. మహారాజ శ్రీ విక్రమేన్ద్రవర్మ

4. శ్రీ ఇన్ద్ర భట్టారకవర్మ

5. శ్రీమాన్విక్రమేన్ద్ర భట్టారకవర్మ

ఇది నిర్వివాదమైన వంశవృక్షము. సర్వదా అంగీకార్యమైనది. ఇకమిగిలియుండు నాల్గు తామ్రశాసనములందు వర్ణింపబడియుండు వంశావళులకు దీనితోనేమైన సంబంధము గలదేమోచూతము. ఇప్పటి వఱకు లభించియుండు విష్ణుకుండిన శాసనములన్నిటిలోను లిపిదృష్టిని పరికించిచూచిన ఈపూరు రెండు గుదెల శాసనములును మిక్కిలి పురాతనమైనవని చెప్పదగియున్నవి. అక్షరస్వరూపమును బోల్చిపరీక్షించిన లిపిమర్మజ్ఞులు ఈపూరు మొదటి గుదెకంటె రెండవదె ప్రాచీన తరమైనదని యభిప్రాయమును వెలిపుచ్చియున్నారు. రెండవ గుదెలో మూడు తరముల రాజులు పేర్కొనబడియున్నారు.

మహారాజ శ్రీమాధవవర్మ I

శ్రీ దేవవర్మ

...శ్రీమాధవవర్మ II

ఈ వంశావళికి మూలపురుషుడైన మాధవవర్మ పైనియైదు శాసనముల సంయుక్త వంశావళియందు వచ్చు మాధవవర్మవలెనే ఏకాదశాశ్వమేధావభృథావధూత జగత్కల్మషుడును నగ్నిష్టోమ సహస్రయాజియునగుటచే వీరిరువురునేకైక పురుషులేయని చరిత్ర పరిశోధకులు దలచుచున్నారు. ఇది సరియైన యభిప్రాయమని తోచుచున్నది. అగునేని యిందలి మూడు తరముల రాజులను పైని సంయుక్త వంశావళితో జోడించిన నీక్రింది వంశవృక్ష మేర్పడుచున్నది.

మహారాజ శ్రీగోవిన్దవర్మ

మహారాజ శ్రీమాధవవర్మ

| | |
|---|---|
| దేవవర్మ | విక్రమేన్ద్రవర్మ |
| శ్రీమాధవవర్మ | ఇన్ద్రభట్టారకవర్మ |
| | విక్రమేన్ద్రభట్టారకవర్మ |

ఈపూరు మొదటి గుదె(౧)లో రెండుతరముల రాజులు పేర్కొనబడియున్నారు.

మహారాజ శ్రీగోవిందవర్మ

మహారాజ శ్రీమాధవవర్మ

కాని యీ దానశాసనమునకు ఆజ్ఞప్తిపై మాధవవర్మ యొక్క పుత్రుడైన మణ్చ్యాణభట్టారకుడు. ఇతనిగూడ జేర్చుకొనిన మూడు తరములేర్పడును.

మహారాజశ్రీ గోవిన్దవర్మ

మహారాజశ్రీ మాధవవర్మ

మణ్చ్యాణభట్టారకుడు

స్థూలముగ జూడ నీ వంశక్రమముపై మేళవించిన వంశమునందంతర్లీన మైనదను భావ మువపాదక మగును. గోవిన్దవర్మ మాధవవర్మల పరస్పర పితాపుత్ర సంబంధమును, మాధవవర్మకృత ఏకాదశాశ్వ మేధాదిక్రతు పరంపరయు నట్టి భావమునకు స్ఫోరకములు: కాని సూక్ష్మముగ బరిశీలించిచూచిన నీ శాసన మునవచ్చు గోవిన్దవర్మ మాధవవర్మలు మీద మేళగించిన వంశావళిలోని యాపేరిటిరాజులకంటె భిన్నులని విదితము కాగలదు.

ఇందలి గోవిన్దవర్మకు ప్రణత సకలసామన్త గో హిరణ్య భూప్రదాతయను బిరుదములుగలవు. ఇవి సంకలిత వంశవృత్తమందలి గోవిన్దవర్మకును జెల్లవచ్చును; కాని యిందలి మాధవవర్మ కందలి యాతనికి లేని బిరుదావళి కొంతకలదు. ఇతడు త్రివరనగరభవనగతయువతీహృదయరంజనుడు; హిరణ్యగర్భ ప్రసూతి. బిరుదావళియందు గానవచ్చెడి యీ భేదము వ్యక్త్యంతరమును సూచించునని తలచెదను. ఈ శాసనమునకు జేరువైనది పులుంబూరు తామ్రశాసనము. దానియందు మూడు తరములరాజులు బేర్కొన బడియున్నారు.

శ్రీ విక్రమహేన్ద్రవర్మ

గోవిన్దవర్మ

మహారాజ మాధవవర్మ

ఈ వంశవృక్షములోని కడపటి రెండు తరములవారును పై దానియందలి మొదటి రెండు తరముల వారివలె గోవిన్దవర్మ మాధవవర్మలే. సంకలిత వంశవృక్షములోని మొదటి రెండు తరముల వారుగూడ వీరివలె గోవిన్దవర్మ మాధవవర్మలే యైనను బిరుదావళులు భేదించుచున్నవి. ఈపూరు మొదటి గుదెలోని గోవిన్దవర్మవలె పులుంబూరు గోవిన్దవర్మయు సామన్తనృపాలమండలిచే మ్రొక్కులుగొన్నవాడే. ఈపూరు మొదటి గుదెలోని మాధవవర్మవలె పులుంబూరు మాధవవర్మయు నేకాదశాశ్వమేధాది బహుక్రతుకర్తమాత్రమే కాక యతనివలె నితడును త్రిదివరనగరభవనగతయువతీజనవిహారణరతుడును, హిరణ్యగర్భ ప్రసూతియు. కావున ఈపూరు మొదటిగుదె పులుంబూరు తామ్రశాసనములు రెంటియందును వివరించిన వంశవృక్షమొక్కటియే యని తోచుచున్నది. ఈ యూహ సరియైనదేని యీ రెండు శాసనముల లోని వంశవృక్షములను మేళగింపవచ్చును.

విక్రమహేన్ద్రవర్మ

గోవిన్దవర్మ

మాధవవర్మ

మఞ్చ్యణ భట్టారకుడు

ఈ కోవలోని ప్రథమ పురుషుని పేరు విక్రమహేన్ద్రవర్మయని శాసనమున గలదు. ఇది ప్రమాదవశమున లేఖకుడు విక్రమేన్ద్రయనుటకు బదులు విక్రమహేన్ద్రయని చెక్కినాడని శాసన పరిశోధకులభిప్రాయపడుచున్నారు. కానగును. అగునేని యీ విక్రమేన్ద్రుడెవ్వడగును ? పై బొందుపఱచిన సంకలిత వంశావళిలో విక్రమేన్ద్రాభిధానముగల వారిరువురు కానవచ్చుచున్నారు. ఒకడు ఏకాదశాశ్వమేధాది బహుక్రతుకర్త యైన మాధవవర్మకు వాకాటకదేవియందు జన్మించిన పుత్రుడు. విష్ణుకుండి వాకాటక వంశద్వయాలంకరిష్ణుడని శాసనములలో ప్రశంసితుడు. రెండవవాడితని పౌత్రుడు, ఇంద్రభట్టారకుని పుత్రుడు. ఈ యిర్వురిలో బులుంబూరి శాసనమందలి విక్రమేంద్రుడు (విక్రమహేన్ద్రుడు) డెవ్వడగునో విచారింతము. ఇతడు పైపేర్కొనిన విక్రమేన్ద్రులలో మొదటివాడు కావలయును, రెండవవాడు కాజాలడు. ఏలనగా నీ రెండవ విక్రమేన్ద్రవర్మ క్రీ. శ. ౫౫౮ లో రాజ్యమునకువచ్చి ౫౭౦ వఱకును ౧౨ యేండ్లకాలము పాలనయొనర్చెనని ఇటీవల వెలువడిన శాసన సాక్ష్యమువలన నిశ్చయమైనది. పులుంబూరు గోవిన్దవర్మయును మాధవవర్మయును నితని సంతతివారయి యుండినచో వారితని తరువాత నొకరివెనుక నొకరు రాజ్యము జేసియుండవలయును. గోవిన్దవర్మ యెంతకాలము రాజ్యపరిపాలనమొనర్చెనో తెలియరాదు" కాని చరిత్రపరిశోధకులేర్పఱచు

కొనిన సమయానుసార మాతడిరువదిరైయెదేండ్లు పాలించెనని మనమనుకొనవచ్చును. పులుంబూరుశాసనము వలన మాధవవర్మ ౪౮ యేండ్లు రాజ్యముజేసెనని తెలియుచున్నది. ఈ లెక్కప్రకారము గోవిన్దవర్మ మాధవవర్మలుకలిసి ౭౩ యేండ్లనగా (౫౭౦+౭౩) ౬౪౩ వఱకు రాజ్యముజేసి యుండవలయును; కాని చాళుక్యద్వితీయ పులకేశి దన యష్టమరాజ్యవర్షమునం దనగా క్రీ. శ. ౬౧౭ లో వేంగికళింగలను జయించి స్వాధీనపఱచుకొనియెనని మారుటూరు శాసనము దెల్పుచున్నది.[1] అటుమీద వేంగి కళింగములందు విష్ణుకుండిన పరిపాలన సాగుటకవకాశములేదు. కావున పులుంబూరు విక్రమేన్ద్ర [విక్రమహేన్ద్ర] వర్మ రెండవ విక్రమేన్ద్రుడు కాజాలడు; మొదటివాడే కావలయును. అగునేని విష్ణుకుండిన వంశక్రమ మీతీరుగనేర్పడును.

మహారాజశ్రీ గోవిన్దవర్మ I

మహారాజశ్రీ మాధవవర్మ I

దేవవర్మ — విక్రమేన్ద్రవర్మ I

శ్రీమాధవవర్మ II

ఇన్ద్ర భట్టారకవర్మ — గోవిన్దవర్మ II

మాధవవర్మ III

విక్రమేన్ద్రవర్మII — ?

మఞ్చ్యణ భట్టారక.

ఇక వంశక్రమమును వర్ణించు శాసనములలో మిగిలియుండునది తుమ్మలగూడెపు మొ॥ అందు మూడు తరములరాజుల పేర్లు గలవు.

మహారాజేన్ద్రవర్మ

మహారాజశ్రీ మాధవవర్మ

మహారాజశ్రీ గోవిన్దవర్మ

1. Copper Plate Ins. in the A.P. Govt. Museum, Vol. I, pp. 36-39.

అక్షరముల పోలికనుబట్టి చూడగా దుమ్మలగూడెపు రెండుగుదెలును గొంచెమించుమించుగ సమకాలికములవలెగన్పట్టును ; కాని తుమ్మలగూడెపు రెండవగుదికంటె మొదటిది నూఱు నూట యిరువదియేండ్లు మునుపటిదని చెప్పవలసియున్నది. ఇందుకు ప్రబలకారణ మందెకలదు. మొదటి గుదెయందు దాతయైన గోవిన్దవర్మ తన యగ్రమహిషియైన పరమమహాదేవి చాతుర్దశార్య సంఘ బౌద్ధభిక్షులకొఱకు ఇంద్రనగరమున గట్టించిన విహారమునకు పెణ్కపఱు గ్రామమును దానముజేసినట్లు చెప్పియున్నాడు.

'స్వస్యాగ్రమహిష్యా పరమమహాదేవ్యా విహారస్య దీప ధూప గన్ధపుష్పధ్వజ పానభోజన శయనాసన గ్లాన భైషిజ్య ఖణ్డస్ఫుటిత శీర్ణ కు శల మూలాను ప చ్ఛే దార్థం ద్వా .. ల పెణ్కపఱోనామ ధేయో ఉదకదానపూర్వకం మతి సృష్టః.'

రెండవ గుదెయందు దాతయైన విక్రమేన్ద్ర భట్టారకవర్మ తన తాతకు దాతయైన గోవిన్దవర్మ యొక్క భార్యయు దన తాతకు దండ్రియైన మాధవరాజునకు దల్లియగు పరమభట్టారికామహాదేవి ఇంద్ర పురమున బ్రతిష్ఠించిన పరమభట్టారికా విహారమందు చాతుర్దశార్య వరభిక్షు సంఘముయొక్క పరిభోగా ర్థము ఇరణ్డేఱు గ్రామమును దానముజేసినట్లున్నది.

'శ్రీగోవిన్దరాజస్యమూర్తిమతీశ్రియప్రత్యవిషయీకృతమనోరథయా పరమభట్టారికా మహా దేవ్యా శ్రీమ దిన్ద్రపురముచ్చై రలంకర్తుకామయేవ ప్రతిష్ఠాపితే శ్రీమతు పరమభట్టారికావిహారే చాతుర్దశార్య వరభిక్షు సంఘపరిభోగాయ .... ఇరణ్డేఱునామగ్రామోదత్తః'.

ఇందువలన దెలియవచ్చునదేమనగా రెండుశాసనములందు బేర్కొనబడియుండు గోవిందవర్మలును వారి భార్యలైన పరమ లేక పరమభట్టారికా మహాదేవులును ఒక్కరే. భిన్నులుగారు. రెంటను పరమ లేక పరమభట్టారికా మహాదేవి చాతుర్దశార్యవర భిక్షుసంఘ విహారముయొక్క నిర్మాతయగుటచే పై వ్యక్త్యై కీకరణము బలపడుచున్నది. కావున తుమ్మలగూడెపు మొదటి గుదె రెండవదానికంటె బ్రాచీనతరమని చెప్ప నొప్పగును. మొదటి గుదెయొక్క మూలప్రతి శిథిలముకాగా దానిబడి యర్వాచీనకాలమున జెక్కించిన ప్రత్యంతరమగుటవలన రెండు గుదెలందలి యక్షరములకును బోలికలేర్పడినవి. ఇది వాస్తమాయెనేని తుమ్మల గూడెపు రెండవ గుదెలోని రాజవంశమునకు మూలపురుషుడైన గోవిన్దవర్మయు మొదటి గుదెలోని కడపటి వాడైన గోవిన్దవర్మయు నొక్కడేయగును. అతనికి మొదటి గుదెలోని మాధవవర్మయు నింద్రవర్మయు బితృపితామహులగుదురు. అప్పుడు విష్ణుకుండినుల వంశక్రమ మిట్లేర్పడును.

తు. గూ.౧ మహారాజేంద్రవర్మ

మహారాజశ్రీ మాధవవర్మ I

మహారాజశ్రీ గోవిందవర్మ I

తు. గూ.౨ మహారాజశ్రీ మాధవవర్మ II

---

ఈపూ.౨ — తు. గూ. ౨. తుం. చిక్కు

దేవవర్మ — మహారాజశ్రీ విక్రమేంద్రవర్మ I
(విష్ణుకుండివాకాటక వంశద్వయాలంకరిష్ణుడు. పరమసౌగతుడు).

శ్రీమాధవవర్మ III
'(త్రికూట మలయాధిపతి)'
తు. గూ. ౨ చిక్కు, రామ, తుం.

---

మహారాజశ్రీ ఇంద్రభట్టారకుడు
(సత్యాశ్రయుడు)

ఈపూ.౧ గోవిందవర్మ II
పులుం.

మాధవవర్మ IV
(జనాశ్రయుడు)

విక్రమేంద్రభట్టారకుడు II
(ఉత్తమాశ్రయుడు)

మణ్చ్యాణభట్టారకుడు

---

ప్రకరణము ౩

## కాలానుక్రమణిక

మొన్న మొన్నటివఱకును విష్ణుకుండిరాజుల రాజ్యకాలమును జక్కగా నిర్ణయించి చెప్పుటకు దగిన యాధారములెవ్వియు లభింపకుండినవి. అందనుక తూర్పుగోదావరి జిల్లాలోని పొలమూరుగ్రామమున దొరకిన తామ్రశాసనములు రెండే వారి కాలనిర్ణయమునకు మూలసాధనములై యుండినవి. ఒకటి విష్ణుకుండి జనాశ్రయ(నాగ్గవ) మాధవవర్మయొక్క పులంబూరు తామ్రశాసనము. (చూ. నెం. ౮). ఇది యారాజు తన ౪౮-వ రాజ్యవర్షమున ఫాల్గుణపౌర్ణమి చంద్రగ్రహణ సమయమున గౌతమసగోత్రుడైన రుద్రశర్మ మనుమడును, దామశర్మ కుమారుడునునగు శివశర్మకిచ్చిన పులుంబూరు గ్రామ సర్వకర పరిహారాగ్రహార దానమును దెల్పును. రెండవది చాళుక్యకీర్తివర్మ పౌత్రుడును ద్వితీయ సత్యాశ్రయ పులకేశివల్లభుని కనిష్ఠ భ్రాతయగు కుబ్జ విష్ణువర్ధనుని పుత్రుడునునైన ప్రథమ జయసింహవల్లభుడు గౌతమసగోత్రుడును దామశర్మ

పౌత్రుడును శివశర్మ పుత్రుడునునైన రుద్రశర్మకతని పూర్వులదైన పులుంబూరగ్రహారముత్సన్నమైపోగా దానిని పునరుద్ధరించి దానముజేసెననితెల్పుచున్నది.[1] ఇందువలన (1) జనాశ్రయ (నాల్గవ) మాధవవర్మచేత పులుంబూరు గ్రామమును దానము గొన్న శివశర్మ యొక్క కుమారుడగు రుద్రశర్మ యదే గ్రామమును చాళుక్య ప్రథమ జయసింహ వల్లభునిచే మరల దానము గొనెననియు, (2) శివశర్మ జనాశ్రయ మాధవ వర్మకును నతని పుత్రుడైన రుద్రశర్మ చాళుక్య ప్రథమ జయసింహ వల్లభునికిని సమకాలికులనియు దెలియుచున్నది. కావున నీనాల్గవ మాధవవర్మకును ప్రథమ జయసింహ వల్లభునకును దండ్రికొడుకుల మధ్యగల యెడముండవలయును.

పైశాసనముల నాధారపఱచుకొని శ్రీకోమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుపంతులుగారు విష్ణుకుండినుల కాలానుక్రమణిక నిట్లు నిర్ధారించిరి:-

"మాధవవర్మ ప్రతిగ్రహీత, జయసింహ వల్లభశాసన ప్రతిగ్రహీత తండ్రి యగుటవలన మాధవవర్మ జయసింహవల్లభుని తండ్రియు వేంగీ చాళుక్య వంశస్థాపకుడును అయిన కుబ్జవిష్ణువర్ధనునికిని, అతని పెద తండ్రియు, శ్రీహర్షుని దక్షిణ హిందూదేశ సుప్రసిద్ధ ప్రతిస్పర్థియు అయిన రెండవపులకేశికిని సమకాలికుడుగా నుండి యుండవలయును."

"ఈవిధమున ఇంచుమించుగ ఆఱవశతాబ్ది యంత్యభాగమును, ఏడవశతాబ్ది ప్రారంభ భాగమును మాధవవర్మ పరిపాలనకాలమని స్థిరపఱచుకొని దీని నింతకన్న స్పష్టముగ నిర్ణయింపగలమేమో చూతము. ఈ దానము ఫాల్గుణపౌర్ణమినాడు చంద్రగ్రహణ నిమిత్తమున జేయబడినట్లు శాసనమువలన దెలియుచున్నది. (పం. ౨౫-౨౬). క్రీ. శ ౫౭౫, ౫౮౩, ౫౮౪, ౬౧౨, ౬౨౧ సం॥ లలో చంద్రగ్రహణము ఫాల్గుణమాసమున వచ్చును. కుబ్జవిష్ణువర్ధనుని చేతనో, అతనిసోదరుడు రెండవపులకేశి చేతనో జయింపబడి యుండవలసిన రాజు యొక్క ౪౮ వ పరిపాలన సం॥ముగ నుండుటకు మొదటిసంవత్సరము మఱియు ముందరిదకాన దానిని త్రోసివేయవలసియుండును. క్రీ. శ. ౬౦౦ ప్రాంతమున ఏడవశతాబ్ది ఆరంభమున ప్రాయికముగ పులకేశిచే జయింపబడిన రాజునకు కడపటి సంవత్సరము (౬౨౧) చాల తరువాతిది యగును గాన దానినిగూడ త్రోసివేయ వలసి యుండును. కుబ్జవిష్ణువర్ధనుడు ౬౧౬ ప్రాంతమున స్వాతంత్ర్యమును బ్రకటించెనని మనకు దెలియును. మిగిలిన మూడుసంవత్సరములలోను ౫౮౩, ౬౧౨ సంవత్సరములలోని చంద్రగ్రహణములు హిందూదేశమున సూర్యుడుదిక్చ్రక్రము (Horizon) న కెగువనున్నప్పుడు సంభవించినవగుటచేత అవి హిందూదేశమున గానరానివి. కావున మాధవవర్మ ఈశాసనమునిచ్చిన సంవత్సరము ౫౮౪ మాత్రమే కావలెను. శాసనకాలము ప్రాయికముగ ౫౮౪ సంవత్సరము ఫిబ్రవరి ౧౦వ తేది కాదగును. శాసనము చివర ఈ దానము రాజుయొక్క ౪౮-వ విజయ రాజ్యసంవత్సరమున చేయబడినట్లు తెలుపబడినది. కావున ఆతని రాజ్యము ౫౩౬ లో ప్రారంభమై యుండవలెను. రెండవపులకేశి కాని లేక ఆతని సోదరుడు కుబ్జ విష్ణువర్ధనుడుకాని వేంగిదేశము నాక్రమించుకొనక పూర్వము జయించిన యీ మాధవవర్మ విష్ణుకుండి వంశములో కడపటివాడేయైన యెడల ఇతడు ౬౪ సంవత్సరముల వఱకు (౫౩౬-౬౦౦) తక్కువకాకుండ పరిపాలించి యుండవలెను."[2]

1. E. I. Vol. XIX, No. 42, pp. 254 f.

ఇట్లు మాధవవర్మకు దానముచేసిన కాల నిర్ణయమును ప్రాతిపదికగా గైకొని యావంశమందంతకు పూర్వపురాజుల కాలమును దామువివరించిన వంశావతార క్రమమునను సరించి యిట్లు నిర్ధారించియున్నారు.

| | | |
|---|---|---|
| ౧౯౧౯–౨౦ సం॥రపు శాసననివేదికలోని ౧౨. వ నెం. శాసనము | మొదటి మాధవవర్మ (౩౫౭–౩౮౨). | |
| | దేవవర్మ (౩౮౨–౪౦౭) | |
| | రెండవమాధవవర్మ (౪౦౭–౪౪౪) | చిక్కుళ్లశాసనము, ఎపిగ్రాఫియాఇండికా, సం॥ ౪ పుట ౧౯౩ |
| రామతీర్థశాసనము, ఎపిగ్రాఫియాఇండికా, సం॥౧౨. పుట ౧౩౩ | మొదటి విక్రమేంద్రవర్మ (౪౪౪–౪౬౯) | |
| | ఇంద్రభట్టారకవర్మ (౪౬౯–౪౯౬) | |
| | రెండవ విక్రమేంద్రవర్మ (౪౯౬–౫౨౧ | |
| ఆంధ్రసాహిత్యపరిషత్ శాసనము | గోవిందవర్మ (౫౨౧–౫౪౬) | ౧౯౧౯–౧౯౨౦ సం॥రపు శాసననివేదికలోని నెం. ౧౧ శాసనము. |
| | మూడవమాధవవర్మ (౫౪౬–౬౧౦) | |
| | మంచణభట్టారకుడు (౬౧౦–?) | |

పులుంబూరు శాసనోక్త దానకాలగ్రహగత్యాది జ్యోతిష్క విశేషముల ననుసరించి శ్రీ లక్ష్మణరావుగారు చెప్పినట్లు సదరు మాధవవర్మ యొక్క పాలన ౫౪౬ లో ప్రారంభమాయెననియు, నతని ౪౮-వ రాజ్యవర్షము ౫౯౪ అగుచున్నదనియు మనమొప్పుకొనవచ్చును. ఈసందర్భమున వారు ప్రతిపాదించిన సిద్ధాంతములును, వారేర్పఱచుకొనిన వంశానుక్రమణిక కాలానుక్రమణికలును నిటీవల బయల్పడిన చరిత్రాంశములకు విరుద్ధములగుటవలన నంగీకార్యములు గావు.

పులుంబూరు శాసనముల వలన గౌతమసగోత్ర శివశర్మ రుద్రశర్మల వలె వారికి దానమిచ్చిన విష్ణుకుండి మాధవవర్మయు బూర్వ చాళుక్య ప్రథమజయసింహవల్లభుడును నొండొరులకు సన్నిహితులని తెలియుచున్నది. శ్రీ లక్ష్మణరావుగారు వారిద్దరికిని మధ్య ఒకపురపాంతరమే యెడముగలదనియు, మాధవవర్మ చాళుక్య రెండవ పులకేశికిని యతని తమ్ముడైన కుబ్జవిష్ణువర్ధనునకును సమకాలికుడనియు, వారు క్రీ.శ. ౬౧౦ లో వేంగిపై నెత్తివచ్చినప్పుడు వారిచే రణముననోడి వేంగిని గోల్పోయెననియు, నటుపిమ్మట క్రీ.శ. ౬౧౭ లో కుబ్జవిష్ణువర్ధ

నుడు నిజ స్వాతంత్ర్యమును ప్రకటించి క్రీ. శ. ౬౩౩ వఱకు ౧౮ యేండ్లు వేంగిని పాలించెననియు జెప్పి యున్నారు కదా! మాధవవర్మ ప్రథమ జయసింహునికి సన్నిహితుడే కావచ్చును. కాని వారిరువురును శ్రీలక్ష్మణరావుగారనుకొన్నంత సమీపస్థులు గారు. రెండవపులకేశి దండయాత్ర లక్ష్మణరావుగారు చెప్పినట్లు క్రీ.శ. ౬౧౦ లో నడువలేదు; అటువెనుక యేడేండ్లు గడచినపిమ్మట పులకేశి తన యష్టమరాజ్యవర్షమున క్రీ.శ. ౬౧౭ లోగాని వేంగిపై నెత్తిరాలేదని యతని మారుటూరు శాసనము రుజువు సేయుచున్నది[1]. మఱియు ౬౧౭లో కుబ్జవిష్ణువర్ధనుడు నిజస్వాతంత్ర్యమును ప్రకటించుకొనలేదు. క్రీ.శ. ౬౩౧వ సం॥నాటి పులకేశి కొప్పార శాసనమందుగూడ నతడు పృథ్వీదువరాజై తన యన్న యధికారము క్రిందనే యుండినట్లు చెప్పి యున్నది[2]. మఱియు నతడు తనరాజ్యవర్షములను క్రీ.శ. ౬౧౭ నుండి లెక్కించుకొనలేదు; అతని రాజ్యకాలపరిగణన ౬౨౪ నుండి ప్రారంభమాయెనని యిటీవలి పరిశోధనలవలన స్థిరపడినది[3]; కావున కుబ్జవిష్ణువర్ధనుడు శ్రీలక్ష్మణరావు గారను కొన్నట్లు క్రీ. శ. ౬౧౭ మొదలు ౬౩౩ వఱకుకాక ౬౨౪ మొదలు ౬౪౧ వఱకును పాలించి యుండ వలయును. అటుపిమ్మట నతని పుత్రుడు ప్రథమ జయసింహవల్లభుడు ౬౪౩ లో రాజ్యాభిషిక్తుడై యుండ వలెను; అతడు రుద్రశర్మకు పులుంబూరును దన పంచమరాజ్య వర్షమునం దనగా ౬౪౭ లో దానమిచ్చెను; మాధవవర్మయతని తండ్రి శివశర్మకు దానమిచ్చినది దన ౪౭వ రాజ్యవర్షములో ననగా ౫౯౪ లోనని శ్రీ లక్ష్మణరావుగారు నిర్ధారించి యున్నారు. కావున మాధవవర్మ దానముజేసినకాలమునకును ప్రథమ జయ సింహవర్మయొక్క దానకాలమునకు మధ్య (౬౪౭-౫౯౪) ౫౩ సంవత్సరములు గడచిపోయినవి. తరమునకు ౨౫ యేండ్ల ప్రకారము లెక్కవేసిచూచిన రెండు పురుషాంతరములు గడచినట్లు చెప్పవలసియున్నది. విష్ణు కుండినుల ప్రభుత్వము పులకేశిదండయాత్రవఱకు సాగినదని శ్రీ లక్ష్మణరావుగారి యొక్క దృఢవిశ్వాసము; కావున విష్ణుకుండినులలో గడపటి వాడైన మన మాధవవర్మ క్రీ. శ. ౫౯౪ సం॥ రమప్పటికి ౪౭ యేండ్ల కాలము ప్రభుత్వము సల్పియుండినను పులకేశి కుబ్జ విష్ణువర్ధనులతో నతని సమకాలికుని జేయుట కొఱకతనికి మఱియొక ౧౬ సంవత్సరముల జీవితకాలమును బ్రసాదించి యతని రాజ్యకాలమును ౬౧౦ వఱకును బెంపం దించిరి. మారుటూరుశాసనమే వారికాలమున బయల్పడియుండినచో నాతనికి మఱియేడేండ్లాయువిచ్చి యతడు ౬౧౭ వఱకు డెబ్బదియేండ్లకు మించినకాలము రాజ్యము జేసెనని చెప్పియుండువారేమొ; కాని మాధవవర్మ ౫౯౪ సం॥కు తరువాత జీవించియుండెననుటకెట్టి యాధారమును లేదు. విష్ణుకుండినుల ప్రభుత్వము చాళుక్యాగమనమునకు కొంతకాలమునకుముందె సమాప్తినందెను. చాళుక్యశాసనము లందెందును విష్ణుకుండి నుల ప్రస్తావమేకానరాదు. మీదుమిక్కిలి గుణగవిజయాదిత్యుడు మున్నగు పెక్కండ్రు తూర్పుచాళుక్య రాజుల శాసనములలో వారి వంశకర్తయగు కుబ్జవిష్ణువర్ధనుడు దుర్జయులనుజయించి వేంగినాక్రమించుకొనినట్లు చెప్పియున్నది.

1. గుణగ విజయాదిత్యుని కాట్లపఱ్ఱు శాసనమున[4] 'సత్యాశ్రయునితమ్ముడైన కుబ్జ విష్ణువర్ధనుడు దుర్జయులను జయించి వేంగిమండలము నాక్రమించుకొనె' ననియు,

1. Copper Plate Ins. of A.P. Govt. Museum, Vol. I pp. 36-39.
2. Ep. Ind. XVII. No. 27 pp. 257 f.
3. Eastern Chālukyas of Vengi, pp. 41-56.
4. S.T.V.N. High School, Annual 1939-40, p. 24.

2. ప్రథమ చాళుక్య భీముని పండిపాక శాసనమున[1] 'అద్వితీయ పరాక్రమసంపన్నుడైన కుబ్జ విష్ణువర్ధనుడు ఆంధ్రవిషయము నాక్రమించుకొనియుండిన దుర్జయులను శాఅదోలి వేంగిని జయించి స్వాధీనము జేసికొనె' ననియు,

3. అతనిదే కాకర్మాను శాసనమునందును కుబ్జవిష్ణువర్ధనుడు 'దుర్జయులను వేంగినుండి యుచ్చాటనజేసి యారాజ్యము నాక్రమించుకొని పదునెనిమిదేండ్లు పాలించె' ననియు.[2]

4. దానార్ణవుని కండయ శాసనమునందు కుబ్జవిష్ణువర్ధనుడు 'ఆద్యముస దుర్జయులకడ నుండి పుడమి (వేంగి) ని బలాత్కారముగ నొడిచికైకొని పదునెనిమిదేండ్లు పాలించె'[3] ననియు జెప్పి యున్నది.

మీద నుదాహరించిన శాసనముల సాక్ష్యము విశ్వాసపాత్రమగునేని - కాదనుటకు గారణము గన్పట్టదు-శ్రీ లక్ష్మణరావుగా రనుకొనినట్లు (1) విష్ణుకుండినుల ప్రభుత్వము రెండవపులకేశి దండయాత్రవఱకు సాగలేదనియు, (2) చాళుక్యులు వేంగిని జయించికైకొనినది విష్ణుకుండినుల నుండి కాదనియు దుర్జయులకడ నుండియనియు, (3) దుర్జయులు చాళుక్య దండయాత్రకు కొంతకాలమునకు ముందే విష్ణుకుండినులను జయించి వేంగి నాక్రమించుకొని యుండిరనియు దెల్లమగుచున్నది.

శ్రీ లక్ష్మణరావు గారి 'ప్రాతిపదిక'యే తరువాతి చరిత్రకారులును శాసనపరిశోధకులును నేర్పఱచుకొనిన విష్ణుకుండి రాజవంశకాలానుక్రమణికలకు బునాదియైనది. ఆయనవలెనే వారును పులుంబూరు తామ్రశాసనద్వయమును మూలాధారముగగొనిరి; కాని వారి కాయనగారితోగాని యొండొరులతోగాని పొత్తుకుదురలేదు. శ్రీ లక్ష్మణరావుగారు విరచించిన రాజవంశానుక్రమణిక నంగీకరింపక యొక్కొకరొక్క దారి ద్రొక్కుటచేత వారి కాలానుక్రమణికములును భిన్నరూపములు దాల్చినవి. ఇటీవల వెల్వడిన తుమ్మల గూడెపు శాసనముల వలన నిందెవ్వియు సరికావని తేలినది. కావున వాని నిచట పరామర్శించదల పెట్టలేదు.

తుమ్మలగూడెమందు లభించిన తామ్రపట్టికా వర్గద్వయములో రెండవది కడుముఖ్యమైనది. అది విష్ణుకుండి ప్రభువుల కాలానుక్రమణికకు లంగరువంటిది. అందు విష్ణుకుండిన ద్వితీయ విక్రమేంద్ర భట్టారకుని యేకాదశ రాజ్యవర్షము శకాబ్దము ౪౮౮ (క్రీ. శ. ౫౬౬)తో జోడింపబడినది. ఇందువలన నతని రాజ్యపరిపాలన శకాబ్దము ౪౭౭ లో ననగా క్రీ.శ. ౫౫౫-౫౬ లో ప్రారంభమాయెనని తెలియుచున్నది. ఇతని

1. Madras Government Or. Mss. Library, Elliot Collection 15-4-26, pp. 185 f.
2 APS Museum, Hyderabad, unpublished.
3. JAHRS. XI, p. 35.

తుండి శాసన మితని పదునాల్గవ రాజ్యవర్షమున ననగా క్రీ. శ. ౫౨౦ సం॥రమునందీయబడెను. అటు తరువాతివి ఇతని శాసనములెవ్వియు గానరాకపోవుటచేత నితని రాజ్యకాలమునం దదియే కడపటియేడని తోచుచున్నది. కావున విష్ణుకుండిన ద్వితీయవిక్రమేంద్రభట్టారకుడు క్రీ. శ. ౫౫౫-౫౬ నుండి ౫౨౦ పర్యంతము రాజ్య మొనర్చెనని మనము నిశ్చయించవచ్చును. ఈ శాసన సాక్ష్యము నాధారముజేసికొని రెండవ విక్రమేంద్రునికి ముందు రాజ్యముజేసిన యతని పూర్వుల రాజ్యకాలమును ఉజ్జాయించికనుగొన నగును. కాని తత్పూర్వము విష్ణుకుండి ప్రభువుల కాలానుక్రమణిక యందడ్డపడు గడ్డుసమస్య కొకదానికి సమాధానమును వెదుకవలసియున్నది. తుమ్మలగూడె తుండి శాసనములవలన రెండవ విక్రమేంద్రుడు ౫౫౫-౫౬ మొదలు ౫౨౦ వఱకు రాజ్యము జేయుచుండెనని తెలుచున్నదికదా! మఱియు నందె యతనికి ముంద తని తండ్రి ఇంద్రభట్టారకుడు కూడ రాజ్యము జేసినట్లుకలదు. ఇందిట్లుండ శ్రీ లక్ష్మణరావుగారు నాల్గవ మాధవవర్మ యొక్క పులుంబూరు దానశాసనమం దుదాహృతమైన దానకాల గ్రహగత్యాది జ్యోతిష విశేషాంశములను పరిగణన మొనర్చి యతడు క్రీ. శ. ౫౪౬ మొదలు ౫౯౪ వఱకు పాలించుచుండినట్లు నిశ్చయించిరికదా. ఇందువలన నాల్గవ మాధవవర్మ పాలించుచుండిన కాలముననె ఇంద్రభట్టారకుడును, నతని తరువాత నతని పుత్రుడైన రెండవ విక్రమేంద్రుడును విష్ణుకుండిన సామ్రాజ్యమును పాలించుచుండినట్లు తేలుచున్నది. ఇది యెట్లు పొసగును? ఈ రాజు లిద్దఱేకకాలమున నొకేరాజ్యముపై ప్రభుత్వసల్పుచుంట విరుద్ధముగ గన్పట్టినను నది యసంగతముగాదు. నాల్గవ మాధవవర్మ ఇంద్రభట్టారక ద్వితీయ విక్రమేంద్రుల వలె విష్ణుకుండిన వంశప్రధానశాఖకుగాక యొకయుపశాఖకు జెందినవాడు. ప్రధానశాఖవారు రాజధానీ నగరమైనట్టి యమరావతి (ఇంద్రలేక శక్ర) పురమునుండి సామ్రాజ్యమును సమస్తమును బాలించుచుండగా నుపశాఖవారు ప్రధానశాఖాధిపతియగు రాజు తమమనోవృత్తికై ప్రసాదించిన సీమలను గ్రామములననుభవించు చుండిరి; మాధవవర్మ కుటుంబమునకు గ్రాసము కొఱకు ప్రసాదించిన సీమ రాజ్యమునం దెచ్చట నుండెనో, నిశ్చయించి చెప్పుటకు వలనుపడకున్నను నది వాకాటక దేశమున నర్మదా తీరమున నుండెనని యూహించుట కవకాశము గలదు. ఏలనగా నీ మాధవవర్మయొక్క పులుంబూరు శాసనమున నితడు త్రివరనగర భవనగత పరమయువతీజనవిహారణరతుడని చెప్పియున్నది. అట్లె యీపూరుమొదటిగుదె తామ్రపట్టికలలోను త్రివర నగరభవనగత యువతీహృదయనందనుడనికలదు. ఈ త్రివరనగర మిప్పటి మధ్యప్రదేశమున జబ్బల్‌పూరు జిల్లాలోని తేవారని శ్రీ లక్ష్మణరావుగారూహించిరి. ఇది సరియైనదే. అగునేని మాధవవర్మ వారి కుటుంబ మునకు మనోవృత్తికై యీయబడిన సీమ తేవారు ప్రాంతమున నుండెనని మనమనుకొనవచ్చును. మూడవ మాధవవర్మ కడపటి దినముల నుండియు విష్ణుకుండిన సామ్రాజ్యము కలతవడియుండెను. పరరాజుల దండయాత్రలతోపాటు దాయాదసామంతుల యార్భాటము వలన దేశమున శాంతిభద్రతలు చెడెను. పరిపాలన పటుత్వము సడలెను. రాజుయొక్క అధికారము సర్వత్రచెల్లుబడికాక యందందు కుంటువడెను. ఇంద్ర భట్టారకుడు దాయాదులతో బెక్కుమారులు పోరాడి విజయుడైనట్లు ప్రకటించుకొనియున్నాడు. చిక్కుళ్ల

శాసనమున ఇంద్రభట్టారకుడు భ్రూభంగ కరవినిర్ధూత సమగ్రదాయాదు డని కలదు; తుండి శాసనమున నితడు సమాఘాతమాత్రత్రస్త కాందిశీభూత విశీర్ణప్రనష్టాశేషదాయాదు డని చెప్పియున్నది; తుమ్మలగూడెపు రెండవ గుదెయందు విధ్వస్తాశేషదాయాద మండలు డని వచించియున్నది. ఇట్లింద్ర భట్టారకునితో బోరాడి దాయాదులలో నాల్గవ మాధవవర్మ యొక్కడై యుండవలయును. దూరపు సరిహద్దు ప్రాంతమునుండిన వాడగుటచేత నతడు ఇంద్రభట్టారకునకు లొంగక స్వాతంత్ర్యమును బ్రకటించుకొనియుండును. తత్కారణమువలననే యతడు తన శాసనాదులందు నిజరాజ్యవర్షముల నుదాహరించుకొన గడగియుండును. అట్లగుట చేతనే యతడు ఇంద్రభట్టారక విక్రమేంద్రులతోగూడ నేకకాలమున రాజ్యపరిపాలన జేయుట తటస్థించి యుండును.

ఇంతవఱకును ద్వితీయ విక్రమేంద్ర చతుర్థ మాధవవర్మల రాజ్యకాలములను నిశ్చయించితిమి. ఇక వారి పూర్వుల కాలమును విచారింతము. విక్రమేంద్ర భట్టారకునికి ముందు రాజ్యము జేసిన యతని తండ్రి ఇంద్రభట్టారకుడు ౨౭ సంవత్సరములు రాజ్యపాలన మొనర్చిన ట్లతని శాసనములు దెల్పుచున్నవి[1]. కావున నీతడు క్రీ. శ. ౫౨౯ మొదలు ౫౫౬ వఱకు ప్రభుత్వము సల్పియుండవలయును. ఇంద్రభట్టారకుని తండ్రి విష్ణుకుండి వాకాటకవంశద్వయాలంకరిష్ణుడైన విక్రమేంద్రుడు రాజ్యము జేసినట్లగపడదు. ఇతని వెవ్వియు శాసనములు గానరావు. ఇతని సంతతివారి శాసనములలో గూడ నితడు రాజ్యమేలినాడని చెప్పుటకు దగిన యాధారమెద్దియు గన్పట్టదు. ఇతని ద్వైమాతుర జ్యేష్ఠ భ్రాత పుత్రుడగు మూడవ మాధవవర్మ సింహాసనము నధిష్ఠించి క్రీ. శ. ౪౮౨ మొదలు ౫౨౯ వఱకు ౪౭ వర్షములు ప్రజాపాలన మొనర్చినట్లున్నది.[2] అతని తండ్రియైన దేవవర్మ సింహాసనమునెక్కలేదు. చిఱుతప్రాయము నందే తన తండ్రి రెండవ మాధవవర్మ రాజ్యము సల్పుచుండగనే మృతినందెనని తోచుచున్నది; కావున మూడవ మాధవవర్మకు ముందు పాలించిన రాజతని తాత రెండవ మాధవవర్మ. ఇతడు క్రీ. శ. ౪౪౫ మొదలు ౪౮౨ వఱకును ౩౭ సంవత్సరములు ప్రజాపాలన మొనర్చియుండవలయును.[3] ఈ మాధవవర్మయొక్క తండ్రియైన గోవిందవర్మకూడ క్రీ.శ. ౪౦౮ మొదలు ౪౪౫ వఱకు ౩౭ యేండ్లు రాజ్యాధిపత్యము జేసియుండవలయును.[4] ఈ గోవిందవర్మ తండ్రియైన మొదటి మాధవవర్మయు నతని తండ్రియైన ఇంద్రవర్మయు నెంతకాలము పాలించిరో తెలియరాదు. చెరియొక యిరువదియైదేండ్ల కాలము పాలనజేసియుందురని తలచిన వారిదొరతనము మొత్తముమీద యేబదియేండ్ల కాలము నడచియుండవచ్చును. మొదటి మాధవవర్మ క్రీ. శ. ౩౮౩ మొదలు ౪౦౮ వఱకును, నింద్రవర్మ క్రీ. శ. ౩౫౮ మొదలు ౩౮౩ వఱకును పాలించి యుండవచ్చును. అట్లగునేని విష్ణుకుండినుల యేలుబడి క్రీ. శ. ౩౫౮ ప్రాంతమున ప్రారంభమైయుండవచ్చును.

---

1. Ep. Ind. XVII. pp. 337-39.
2. *Ibid.*, pp. 314-37.
3. *Ibid.*, pp. 334-37.
4. Bhārati, Vol. of 42 No. 6, pp. 4-28.




ప్రకరణము ౪

## చరిత్ర

విష్ణుకుండిన వంశోత్పత్తిని గూర్చి మనకు దెలియవచ్చు విషయమత్యల్పము. విష్ణుకుండి అనునది శాసనములందు కొన్ని యెడల గోత్రనామముగను మఱికొన్ని తావుల వంశాభిధానముగను గన్పట్టుచున్నది. వేల్పూరి శాసనమున మాధవవర్మ తండ్రియైన గోవిందవర్మ విష్ణుకుండిగోత్ర ప్రభవుడైనట్లు చెప్పియున్నది.[1] మఱియు తుండి తామ్ర పట్టికలలో మాధవవర్మ కుమారుడైన మొదటి విక్రమేంద్రుడు విష్ణుకుండి వాకాటక వంశద్వయాలంకృత జన్ముడని కలదు. మఱియు నతని కుమారుడైన ఇంద్రభట్టారకుడు విష్ణుకుండి కుల తిలకుడనియు, మనుమడైన రెండవ విక్రమేంద్రుడు విష్ణుకుండ్యాన్వయ మకుట చూళామణి యనియు వర్ణింపబడియున్నారు.[2] దీనినిబట్టి చూడగా విష్ణుకుండి యనునది వారి గోత్రాన్వయములు రెంటికిని ఏకైక నామముగ జెల్లుచు వచ్చెనని తోచుచున్నది. విష్ణుకుండినుల యాదిమ నివాసస్థాన మెద్దియో నిశ్చయముగ దెలియదు. పరిశోధకు లీవిషయమై భిన్నాభిప్రాయములను వెలిపుచ్చియున్నారు. విష్ణుకుండిన శబ్దము వినుకొండకు సంస్కృతీకరణమనియు, వారి కులదైవము శ్రీ పర్వతస్వామియైన మల్లికార్జునుడనియు నేతత్కారణముల వలన వారి యాదిమ నివాసస్థాన మిప్పటి గుంటూరు మండలములోని వినుకొండ ప్రాంతమనియు గొందఱు చెప్పుదురు.[3] కాని యిది సంశయాస్పదము. విష్ణుకుండిశబ్దము వినుకొండయొక్క

1. A.R. No. 350 of 1937-38. 2. A. P. G. S. No. 8.
3. Early Dynasties of Andhradēśa, pp. 422-27.

సంస్కృతీకరణము గాజాలదు. 'విను' యొక్క సంస్కృతరూపము 'విష్ణు' కాదు; కుండి యన గుండము. 'కుండి' కొండకాజాలదు. వినుకొండకు సంస్కృతమున శ్రుతిపర్వతమని పేరు చెల్లుచుండెనని క్రీడాభిరామము వలన దెలియుచున్నది.[1] కావున విష్ణుకుండిశబ్దము వినుకొండకు సంస్కృతీకరణమనుట తగదు. శ్రీపర్వత స్వామి శ్రీశైల మల్లికార్జున దేవుడనుటయు సంశయగ్రస్తమే. ప్రాచీనకాలమున శ్రీపర్వతనామము నాగార్జునకొండకుగూడ చెల్లుచుండెనని ఇక్ష్వాకుల శాసనములవలన దెలియవచ్చుచున్నది.[2] క్రీస్తుశకప్రారంభ శతాబ్దులలో ననగా విష్ణుకుండినులు వర్ధిలుచుండిన కాలమున నది సుప్రసిద్ధ బౌద్ధక్షేత్రమై వెలయుచుండెను. కావున విష్ణుకుండినుల కులదైవమైన శ్రీపర్వతస్వామి నాగార్జునకొండలో నెలకొనియున్న బుద్ధదేవుడైన గావచ్చును. ఈసందర్భమున విష్ణుకుండినరాజ్యసంస్థాపకుడని యెన్నదగిన మొదటి గోవిందవర్మ బౌద్ధధర్మాను ష్ఠానపరుడని స్మరణకు దెచ్చుకొనుట యుక్తము. మఱికొందఱు విష్ణుకుండినులాంధ్రులు గారనియును వెలుపటినుండివచ్చి యాంధ్రదేశమున రాజ్యమును సంపాదించి యచట స్థిరముగ నెలకొనిన యన్యదేశజులనియు జెప్పుదురు. విష్ణుకుండినుల కాకాలమున మధ్యదేశము నేలుచుండిన వాకాటకరాజకుటుంబముతో వైవాహిక సంబంధముండెనని వారి శాసనముల వలన దెలియవచ్చుచున్నది. వాకాటకులు శ్రీశైలపర్యంతము వ్యాప్తమైన దేశమును బరిపాలించుచుండిరి. కావున విష్ణుకుండినులాంధ్రదేశమున వాకాటకులచే బ్రస్థాపితులైన యన్య దేశజులని కొందఱు వాదించుచున్నారు.[3] కాని వాకాటకుల యధికారము శ్రీశైలమువఱకు జెల్లుచుండె ననుట కాధారమెద్దియు లేదు. మఱియు విష్ణుకుండినులకు క్రీ. శ. ౫ వ శతాబ్దమునకు మునుపు వాకాటకులతో నెట్టి సంబంధ ముండిన ట్లగపడదు. క్రీ. శ. ౬ వ శతాబ్దారంభమున వాకాటక హరిసేను డాంధ్రదేశముపై నెత్తి వచ్చి జయించిన ట్లతడు దన శాసనములందు చెప్పుకొనియున్నాడు. కాని తత్పూర్వము కనీసమొకశతాబ్దము నుండియు నాంధ్రదేశమును విష్ణుకుండినులు పాలించుచుండినట్లు వారి శాసనములు దెల్పుచున్నవి. కావున వారు వాకాటకులతో గూడ వచ్చి యాంధ్రదేశమున నెలకొనిన యన్యదేశజు లనువాద మంగీకరించదగినది కాదు. విష్ణుకుండిన రాజ్యస్థాపకుడైన మొదటి గోవిందవర్మ తన తుమ్మలగూడెపు తామ్రశాసనమున శ్రీ పార్వతేయ పూర్వాపరక్షితిపతి పరంపరాహారముల మధ్య తాను కౌస్తుభమణివంటి వాడనని చెప్పుకొని యున్నాడు. కావున నితని మనికి నాగార్జున కొండయో తత్పరిసర దేశమో కావలయును.

విష్ణుకుండినుల దాద్యమున బ్రాహ్మణవంశము. తుమ్మలగూడెపు తామ్రశాసనము రెండవగుది యందు 'బ్రహ్మక్షత్రతేజోభృతాం......విష్ణుకుండినామ్' అని కలదు. బ్రహ్మక్షత్రులనగా పుట్టుకచే బ్రాహ్మ ణులై యుండి క్షత్రియవృత్తి నవలంబించుటవలన క్షత్రియత్వము నందినవారు. ప్రాచీన పల్లవకదంబ వంశము లవలె వీరిదియు నాద్యమున బ్రాహ్మణవంశమే.

## మొదటి గోవిందవర్మ

(క్రీ.శ. ౪౦౮-౪౪౫)

విష్ణుకుండిన వంశజులలో మొదటివాడైన ఇన్ద్రివర్మ్మను గూర్చి కాని యతని పుత్రుడైన మొదటి మాధవవర్మ్మను గూర్చి కాని మనకేమియు దెలియరాదు. వారు సామాన్యులైన సామంతులై యుందురని మనమూహించవచ్చును. ఇంద్రవర్మ్మ మనుమడైన మొదటి

1. క్రీడాభిరామము 20.
2. Ep. Ind. Vol. XX, pp. 9, 22, 23, 36.
3. HAS. 14. p. 6. Dubreuil: Ancient History of the Deccan, p. 90.

గోవిందవర్మతోడనే విష్ణుకుండినుల యభ్యుదయము ప్రారంభమైనది. అతడును నాద్యమున సామంతుడై యుండి తరువాత తనతోడి సామంతుల నెల్లరను జయించి యధిరాజపదము నార్జించినట్లున్నది. తాను స్వభుజబలోత్సాహ ప్రభావానురాగావాప్త స్వరాజ్యుడ ననియు, శౌర్యధైర్య ప్రతాపానుభావాదన్య సామాన్తాక్రాన్త రాజ్యాన్తరుడననియు దన తుమ్మలగూడెపు శాసనమునందు చెప్పుకొనియున్నాడు. ఇత డేయధిరాజునకు సామంతుడై యుండెనో యితనిచే విజితులైన యన్య సామంతులెవ్వరో చెప్పుటకు సాధ్యము గాదు. కాని యితని మనుమని మనుమడైన ద్వితీయేంద్రభట్టారకుడు తన తుమ్మలగూడెపు ద్వితీయ తామ్రపట్టికయందు ఇతడు శ్రీపార్వతేయ పూర్వాపరక్షితిపతి పరంపరాహారమధ్య నిరుపమ విరాజితయా కౌస్తుభాయమాన యశోజన్ముడని ప్రశంసించి యుండుటవలన, ఇతడు జయించిన అన్య సామంత వర్గము శ్రీపర్వతమునకు బూర్వాపర దిగ్భాగములందు చిన్న చిన్న సంస్థానములను పాలించుచుండిన మన్నెదొరలై యుందురని తోచుచున్నది. ఇతని రాజ్యవిస్తార మెంతటిదో తెలియదు. కాని ఇతడు తన రాజ్యములోని ప్రతి విషయమందును స్తూపములను విహారములను నిర్మించెనని మీది యుదాహృత శాసనమందు చెప్పియుండుట చేత నందు పెక్కు విషయములుండెననుట నిశ్చయము. ఈ గోవిందవర్మ పృథ్వీమూలుని వంశసంజాతయగు పరమభట్టారికామహాదేవిని శ్రీదేవి గోవిందుని (విష్ణుదేవుని) వలె యుద్వాహము జేసికొనెను. ఈపృథ్వీమూలు డెవ్వడో తెలియదు. గోదావరి తామ్రపట్టికలో నొక పృథ్వీమూలుడు పేర్కొనబడి యున్నాడు.[1] కాని యాతడు ఈగోవిందవర్మ మునిమనుమడైన ఇంద్రభట్టారకునికి సమకాలికుడు; కావున నతడు గోవిందవర్మ భార్యయైన పరమభట్టారికామహాదేవి యొక్క పూర్వికుడై యుండజాలడు.

గోవిందవర్మ బౌద్ధమతానుయాయి. ఇతడు సకల సత్వధాతుత్రాణాయోత్పాదిత మహాబోధి చిత్తుడు. తనరాజ్యమందొక్కొక్క విషయమందును బహుప్రకార మనోరమోదార కర్మాద్భుతస్తూప విహారాదులను నిర్మించెను. బౌద్ధుడైనను గోవిందవర్మ వైదికధర్మము నాదరించెను. దేవాలయములను గట్టించెను. తన విత్తమునంతటిని భిక్షుద్విజానాథ యాచకవ్యాధిత దీనకృపణజనోప భుజ్యమని తలచి దాన మొనర్చెను. ఇతని త్యాగము తుమ్మలగూడెపు తామ్రపట్టికా ప్రథమ గుచ్ఛకమందిట్లు వివరింపబడియున్నది. "గ్రామ క్షేత్రహిరణ్య ద్విరదతురగ గోబలీవర్ద శయనాసన యానపాన భోజన భాజన భవన వసనాభరణ కన్యాదాసీ దాససహస్రాణాందాతా. అనేక దేవాయతన విహార సభాప్రపాతటాకోదపానారామ ప్రతిసంస్కార పూర్వకరణే నాలంకృత దిగంతరః'' అని. పై దానముల వలన నితడనురక్తవర్ణాశ్రమ స్వజన పరిజనుడాయెను. గోవిందవర్మవలె నతని పట్టమహిషి మహాదేవియు బౌద్ధమతాభినివిష్టురాలు. ఆమె చాతుర్దశార్య సంఘభిక్షులకొఱకు ఇంద్రపురముననొక మహావిహారమును నిర్మించెను. ఆ విహారమునకు దీప ధూపగంధ పుష్పధ్వజపాన భోజనశయనాసనగూన భైషిజ్య ఖణస్ఫుటిత శీర్ణ సంస్కారాదుల కొఱకు భర్తచే పెన్కపఱను గ్రామమును దానము జేయించెను.

గోవిందవర్మ జ్ఞాని. సకల శాస్త్రార్థశ్రవణ పరిజ్ఞానాదిహపరత్ర చానన్యచక్షుషుడని శాసనము దెల్పుచున్నది. ముఖ్యముగ నితనికి బౌద్ధదర్శనమున చొరవ యధికము. ఇతడు విద్వత్సమాశ్రయుడు. విద్వాంసులను పెక్కుర జేరదీసి వారితో శాస్త్రవాదము సేయువాడు.

1. Bombay Gazetteer, Vol. I, Part II, p. 334.

ముప్పదియేడేండ్లు రాజ్యముజేసి గోవిందవర్మ దేహము చాలించెను. ఇతని యనంతర మితనికి పట్టమహిషి పరమమహాదేవి యందుద్భవించిన కుమారుడు మాధవవర్మ రాజ్యాభిషిక్తుడాయెను.

## రెండవ మాధవవర్మ

(క్రీ.శ. ౪౪౫–౪౮౨)

పై వివరించిన వంశానుక్రమణిక ననుసరించి ఈ వంశమున మాధవవర్మ నామధారులగు రాజులలో నితడు రెండవవాడగుచున్నాడు. కావున నీవ్యాసమునం దితని రెండవ మాధవవర్మ యని పేర్కొనుచున్నాడను. ఇతడు తండ్రివలెగాక వైదికమతాభినివిష్టుడు. అగ్నిష్టోమవాజపేయపౌండరీకాశ్వమేధ రాజసూయాది క్రతువులును జేసెనట. ఇందు ముఖ్యమైన వశ్వమేధ రాజసూయములు. వీనిజేయుటవలన నితడు సార్వభౌముడని తెలియుచున్నది. పదునొకండు మార్లశ్వమేధయాగము జేసియుండుటవలన నితడన్నిమార్లు దిగ్విజయమొనర్చి శత్రురాజులను నిర్జించి వారి నదిమి కప్పముగొనెనని తోచుచున్నది. వాస్తవము విచారించిచూడ నితడు గొప్పవిజేతగ గన్పట్టుచున్నాడు. బలాధికుడు. ఇతనికడ నెనిమిదివేల యేనుగులును, పదికోట్లగుఱ్ఱములును, లెక్కకుమిక్కుటమైన పదాతివర్గమును నుండెనని ఇతనిసంతతివారమని చెప్పుకొన్నయర్వాచీన భూపతుల శాసనములందు చెప్పియున్నది.[1] ఇందెంత వాస్తవముకలదో తెలియదు. ఇతని రాజ్యము ప్రాగ్దక్షిణాపరాంభోనిధిరేవా సరిత్సలిలవలయితమని రెండవ తుమ్మలగూడియ తామ్రపట్టికాగుళుచ్ఛమందుకలదు. ఇంతగొప్ప సామ్రాజ్యము నితడెట్లు సంపాదించగలిగెనో తెలియదు; కాని యితనిచే పరాజితులైన రాజులలో వాకాటకులు ముఖ్యులై యుండవలయును. ఏలనగా నీ కాలమున దక్కను పశ్చిమార్ధమున దక్షిణమున కుంతలమునుండి యుత్తరమున రేవా పర్యంతమును, దూర్పున నజంటా యెల్లోరాలనుండి పశ్చిమమున సముద్రము వఱకును వ్యాప్తమైన దేశమంతయు వారియేలుబడి క్రిందనుండెను. వారిని జయింపక మాధవవర్మ యపరాంభోనిధి రేవా సరిత్పర్యంత వ్యాప్త భూమండలము నాక్రమించుకొని యుండజాలడు. వాస్తవము గూడనట్లె జరిగెనని చెప్పవలసియున్నది. మాధవవర్మకు సమకాలీనుడును వాకాటకరాజవంశ ప్రధానశాఖయందు కడగొట్టు వాడునునైన ద్వితీయపృథ్వీసేనుడు తన బాలఘాటు శాసనములో బరాక్రాంతమైన నిజరాజ్యమును రెండుమారులు మరల సాధించితినని చెప్పియున్నాడు.[2] అతడు తన రాజ్యముపై నెత్తివచ్చిన శత్రులెవ్వరో పేర్కొనియుండలేదు. కాని వారిలో మన మాధవవర్మ యొక్కడనుట నిశ్చయము. ఈ దండయాత్రయందు విజయుడైనను మాధవవర్మ వాకాటకరాజ్యమును దుదముట్టింపక ద్వితీయ పృథ్వీసేనునితో సంధిజేసికొనెను. సంధిషరతుల ప్రకారము పృథ్వీసేనుడు దనయేకైకపుత్రికను మాధవవర్మకిచ్చి యుద్వాహముజేసి తన మరణానంతరము నిజరాజ్యమల్లుని జెందుట కంగీకరించెను. మాధవవర్మకు పృథ్వీసేనుని కుమారితయందు విక్రమేన్ద్రవర్మయను పుత్రుడొకడు జన్మించెను. విష్ణుకుండినుల శాసనములు పెక్కింటిలో నిత డుభయవంశాత్మజాలంకారజన్ముడనియు వాకాటక మహాదేవీ సుతుడనియు బేర్కొనబడియున్నాడు. ఇందువలననితడు విష్ణుకుండినవాకాటకవంశములు రెంటికిని వారసుడని గ్రహింపనగును.

---

1. Ep. Andhrika, Vol. I, P. 115.
2. Ep. Ind. IX, p. 267.

మాధవవర్మకు వాకాటకుల తోడనేకాక దక్షిణమున పల్లవులతో గూడ వైరముగలిగెను. వేల్పూరి శిలాశాసనమునందు విష్ణుకుండి గోవిందవర్మ పుత్రుడైన మాధవవర్మమహారాజు విక్రమేన్ద్రునితో గూడ వేల్పూరి స్కంధావారమున విడిసియుండినట్లు చెప్పియున్నది. ఇందు పల్లవకులము గూడ పేర్కొనబడి యుండుటచేత విక్రమేన్ద్రసహితుడై దండెత్తిపోయి వేల్పూరు శిబిరమున మాధవవర్మ విడిసియుండినది, పల్లవదండయాత్రాసందర్భముననని మనము గ్రహించవచ్చును.

ఈ పల్లవులెవ్వరో వారితో మాధవవర్మ కేల పోరాటము గలిగెనో కనుగొనవలసియున్నది. క్రీ. శ. ౩ వ శతాబ్ద ప్రారంభ దశకములలో నాంధ్రసాతవాహన సామ్రాజ్యము విచ్ఛిన్నమై పోయినది. దాని స్థానమున పెక్కు నూతన రాజ్యము లుద్భవించినవి. అందు ముఖ్యమైనవి నాలుగు. దక్కను ఉత్తరార్థమున వాకాటకరాజ్యము, దక్షిణార్ధమున పశ్చిమ సముద్రతీర ప్రాంతమున వనవాసి చూటు నాగరాజ్యమును, బూర్వసముద్రతీర ప్రాంతమున విజయపురఇక్ష్వాకు రాజ్యమును, నీరెంటికిమధ్య కాంచీపురపల్లవ రాజ్యమును వర్ధిల్లినవి. దక్షిణార్ధములోని రాజ్యములన్నింటిలోను పల్లవ రాజ్యము కడుపెద్దది. చూటునాగేక్ష్వాకు రాజుల క్రిందనుండిన పరిమితకర్ణాటాంధ్ర ప్రాంతములు పోను తక్కిన కర్ణాటదక్షిణాంధ్ర భూభాగములును ద్రావిడచోళ దేశములును పల్లవుల యేలుబడి క్రిందనుండినవి. పల్లవులు బ్రాహ్మణులు, భారద్వాజులు మహాభారతవీరులైన ద్రోణాశ్వత్థామల సంతతివారమని వారు తమ శాసనములందు ప్రకటించుకొని యున్నారు. వాకాటక సాలంకాయన విష్ణుకుండినులవలె వీరును దర్భలను సమిధలను బట్టనలవడిన హస్తములందు ధనుర్బాణ ఖడ్గఖేట కాద్యాయుధముల ధరించి యాయుధోపజీవులై క్షత్రియ వృత్తినవలంబించి స్వతంత్ర రాజ్యములను స్థాపించి పాలించిన ద్విజసత్తములు. తాము బ్రహ్మక్షత్రులమని సగర్వముగ జెప్పుకొనిరి. బ్రహ్మక్షత్రులనగా జన్మతః బ్రాహ్మణులైనను వృత్తిచే క్షత్రియులైనవారు. పల్లవులకు రాజ్య ప్రాప్తికలిగిన విధమును చరిత్రకారులిట్లు వివరింతురు. సాతవాహన నరపాలురలో గడపటివాడైన నాలుగవ పులుమావి గతించిన పిమ్మట విచ్ఛిన్నమైన యాంధ్ర సామ్రాజ్యములో జాలభాగమును అతని సేనాధ్యక్షుడైన స్కందనాగు డాక్రమించుకొని స్వతంత్రుడాయెను. ఇతనికి పురుషసంతతిలేదు. కుమారిత యొక్కతె మాత్రముగలదు. ఆ కన్యక నతడు వీరకూర్చపల్లవునికిచ్చి యుద్వాహమొనర్చెను. స్కందనాగుని మరణానంతర మతని రాజ్యమునకు వీరకూర్చపల్లవు డధిపతి యాయెను.[1] ఇట్లునాగకన్యకమూలమున నాగరాజ్యము వీరకూర్చునికి సంక్రమించినది.

ఈ యుదంతము నర్వాచీన పల్లవ శాసనములందు వివరించియుండు చరిత్రాంశముల నాధార పఱచుకొని యాధునిక పరిశోధక పండితు లూహించి వ్రాసినది, సమంజసముగ నేకన్పట్టుచున్నది. ఇందలి వాస్తవార్థమెట్టిదైనను, సాతవాహన సామ్రాజ్యము విచ్ఛిన్నమైనదాది కృష్ణా దక్షిణతటమున వ్యాపించియుండినట్టి యా సామ్రాజ్యభాగములపై బల్లవుల యధికారము జెల్లుచుండెనని నిరాతంకముగ జెప్పనగును. ఆద్యము నుండి పల్లవులు దక్షిణదేశమంతటిపై దమ యధిరాజ్యమును నెలకొల్పగడగుటచే వారి కిరుగుపొరుగు రాజ్యములతో బోరాటము సామాన్యమాయెను. మొట్టమొదట పల్లవుల దృష్టిని విజయపు రేక్ష్వాకు రాజ్య

1. S. I. I. Vol. II, Velūrpāḷaiyam Plates V. 6.

మాకర్షించినది. క్రీ. శ. ౪ వ శతాబ్ద ప్రారంభమున పల్లవులు ఇక్ష్వాకురాజవంశమును గూలద్రోసి వారి రాజ్యము నాక్రమించుకొని నట్లున్నది. ఇక్ష్వాకువంశనృపాలురలో గడపటివాడు రుద్రపురిషదత్తుడు. ఇతడు క్రీ. శ. ౩౦౦ ప్రాంతమున నుండెనని శాసనపరిశోధకుల యభిప్రాయము.[1] అటుతరువాత ఇక్ష్వాకులు పొడవడగిరి. అప్పుడో యంతకించుక పూర్వమో పల్లవు లిక్ష్వాకుల రాజ్యమును బ్రవేశించినట్లున్నది. గుంటూరుజిల్లా పల్నాడు తాలూకాలోని మంచికల్లు గ్రామమున పల్లవ వంశజుడును భారద్వాజుడును నశ్వమేధయాజి యునగు సింహవర్మ యొక్క శాసన మొక్కటికలదు.[2] ఇది ప్రాకృతభాషలో బ్రాహ్మీలిపియం దుల్లేఖింపబడి యున్నది. లిపిస్వరూపమును బట్టియది క్రీ. శ. చతుర్థ శతాబ్దముప్రారంభ కాలము నాటిదని శాసనపరిశోధకు లభిప్రాయపడుచున్నారు. పల్లవ శాసనములలో నిది ప్రాచీనతమ మైనది. ఈ శాసనకర్తయగు సింహవర్మ పల్లవరాజులలో బ్రథముడనియు, మైదవోలు హిరహడగల్లి శాసనము లెత్తించిన విజయ లేక శివస్కందవర్మ కంటె బూర్వుడనియు, నితడె యిక్ష్వాకు రాజులను గూలద్రోసి వారి రాజ్యమును దనకడ దుర్గముతోగూడ వైవసము జేసికొనెననియు జరిత్రకారులు నిశ్చయించియున్నారు. వీరి సిద్ధాంతము గ్రాహ్యామే. పరిశోధకులు కొందఱు పైబేర్కొనిన విజయ లేక శివస్కన్దవర్మ సింహవర్మ యొక్క కుమారుడనియు నతడు తన తండ్రికాలమున యౌవరాజ్యపదమున కభిషిక్తుడై రాజ్యపరిపాలనమున బాల్గొనుచుండె ననియు చెప్పుదురు. సంగత మెకావచ్చును. తాత్కాలికముగ నీ సిద్ధాంతము నంగీకరింతము.

సింహవర్మ కాలమునం దంతకుముం దిక్ష్వాకుల యేలుబడిక్రిందనుండిన రాష్ట్రమున కంధ్రపథమను నామము చెల్లుచుండెను. దాని ముఖ్యస్థానము ప్రాచీన సాతవాహన రాజుల రాజధానియైన దన్నకడము. అచ్చటనే యువ మహారాజు శివస్కన్దవర్మ పక్షమున నాప్రాంతమును బాలించుచుండిన వ్యాపృతుడు నివసించుచుండెనని మైదవోలు తామ్రపట్టికలవలన దెలియవచ్చుచున్నది.[3] శివస్కన్దవర్మ కాంచీపురసింహాసనము నధిష్ఠించిన పిమ్మట నతని కుమారుడైన బుద్ధవర్మ యౌవరాజ్యపట్టాభిషిక్తుడై యాంధ్రపథమున కధిపతి యాయెను.[4] శివస్కన్దవర్మ యొక్క రాజ్యాంతకాలముననో యనంతర మత్యంత స్వల్పకాలముననో యంధ్రపథమున గొప్ప విప్లవ ముప్పతిల్లినది. దీనికి గారణభూతుడు విష్ణుకుండిన గోవిందవర్మ. ఇతడాద్యము నం దిక్ష్వాకురాజులకు సామంతుడై యుండి వారిపతనానంతరము వారిరాజ్యము నాక్రమించుకొన్న పల్లవుల యాధిపత్యము నంగీకరింపక తిరుగుబాటు చేసి స్వతంత్రుడైనట్లున్నది. ఈతడెట్లు పల్లవులతో బోరాడి నిజస్వాతంత్ర్యమును నెలకొల్పెనో నిశ్చయించి చెప్పుటకు వలనుపడదు. కాని గోవిందవర్మ తన తుమ్మలగూడెపు తామ్రశాసనమున దన్ను గూర్చి చెప్పుకొనిన విషయములనుబట్టి యతడు పల్లవులను జయించియే నిజస్వాతంత్ర్యమును నెలకొల్పెనని యూహించుట కవకాశము గలదు. ఇతడు శ్రీపర్వత పూర్వాపర దిగ్భాగములందలి సామంత రాజన్యులను జయించి స్వతంత్రరాజ్యమును స్థాపించెనట. ఇతని పట్టమహిషి పరమభట్టారికామహాదేవి బౌద్ధభిక్షులకొఱకింద్రపురమున మహావిహారము గట్టించెనట. ఈ యింద్రపురము దన్నకడ సమీపముననుండు

1. A. P. G. M. S. No. 5. A Catalogue of Ikshvāku Coins., p. 7.
2. Ep. Ind. XXXII, p. 87 f.
3. *Ibid.*, VI, p. 84 f.
4. *Ibid.*, VIII, p. 143.

## ఇంద్రభట్టారకవర్మ
(క్రీ.శ. ౫౨౮-౫౫౬)

దాయాదులను నిర్జించి కైకొన్న రాజ్యము నింద్రభట్టారకు డిరువదియేడేండ్లు పాలించెను. ఇతనికి సత్యాశ్రయుడను బిరుదనామముండినట్లు తుమ్మలగూడెపు తామ్రపట్టికల రెండవ గుదియొక్క ప్రారంభ శ్లోకము వలన దెలియుచున్నది. సామంతులు పెక్కండ్రితని యాజ్ఞను దలమోచి సేవించిరి. చతురుదధిన్నృపతిమణిమకుట మయూఖవిచ్ఛురిత పాదాంబురుహుడనని తనయాధిక్యమును రామతీర్థ శాసనమున బ్రకటించుకొనియున్నాడు. ఇతడు శైవమతాభినివిష్టుడు. పరమమాహేశ్వరుడని శాసనము లుద్ఘాటించుచున్నవి. పరమ మాహేశ్వరుడనగా శైవదీక్షగొన్నవాడని యర్థము. మఱియు నితడు సతత భూమిగోకన్యా హిరణ్యా దాన పరుడు. ఇతడు చేసిన ఘనకార్యములలో ఘటికా నిర్మాణ మొక్కటి. ఘటికలనగా విద్యాస్థానములు. వీని విషయము ప్రకరణాంతరమున వివరించెదను.

ఇంద్రభట్టారకుడనేక చాతుర్దంతసమర విజయుడైనట్లతని పుత్రుడైన రెండవ విక్రమేంద్ర భట్టారకుని తుమ్మలగూడె తుండితామ్రశాసనములందు చెప్పియున్నను, నతని కాలమున నడచిన యుద్ధవిశేషము లెవ్వియుదెలియరావు; కాని సమకాలిక అన్యరాజ వంశజుల శాసనములవలన నొండు రెండు విషయములు వ్యక్తమగుచున్నవి. ఇందు మొదట పేర్కొనదగినది మౌఖరి ఈశానవర్మయొక్క హరహాశాసనము. ఇది విక్రమకాలమున ౬౧౧ వ వర్షమున ననగా క్రీ. శ. ౫౫౪ వ సంవత్సరమున నుల్లేఖింపబడినది. ఇందు ఈశానవర్మ ఆంధ్రులను శూలికులను గౌడులను రణమునం దోడించినట్లు చెప్పియున్నది.[1] మఱియ నీరాజే జాన్‌పురమునందు నెలకొల్పిన శాసనములో దనచే బరాజితుడైన యాంధ్రాధిపతి భీతచేతస్కుడై వింధ్యాద్రి గుహల నాశ్రయించెననియు, నచటినుండికాబోలు నాతడు రైవత కాచలమునకు బోయెననియు వచించియున్నది. విక్రమ ౬౧౧ (కీ. శ. ౫౫౪)వ సంవత్సరమునందాంధ్రదేశమును బాలించుచుండిన రాజు విష్ణుకుండి ఇంద్రభట్టారకుడని తుమ్మలగూడెపు రెండవగుది తామ్రశాసనము వలన నిశ్చయముగ దెలియవచ్చుచున్నది. కావున విక్రమ ౬౧౧ (కీ. శ. ౫౫౪)లోనో లేక యించుక పూర్వమో ఈశానవర్మచే బరాజితుడైన యాంధ్రాధిపతి విష్ణుకుండి ఇంద్రభట్టారకుడేయని మనము నిస్సంశయముగ దీర్మానించవచ్చును. అయిన నీ మౌఖరి ఈశానవర్మ యెవ్వడో యతడాంధ్రాధిపతియైన విష్ణుకుండి ఇంద్రభట్టారకు నెపు డెచట నే సందర్భమున బరాభూతునిగావించెనో విచారించ దగియున్నది.

మౌఖరులది కడుపురాతన భారతీయక్షత్రియ వంశము. వీరు తమ శాసనములలో మహాభారతమున బేర్కొనబడియుండు మద్రదేశాధీశ్వరుడైన యశ్వపతి తమవంశమునకు మూలపురుషుడని వక్కాణించి యున్నారు. పాణినీయమందు వీరి ప్రస్తావన గలదని కొందఱందురు. మౌర్య బ్రాహ్మిలిపిలో మొఖలీనామ్ అని వీరినామాంకితమైన మృణ్మయముద్ర యొక్కటి గయా ప్రాంతమున దొరకినది. గుప్తచక్రవర్తులనాడీ వంశమునకు జెందిన కొన్ని కుటుంబములవారు సైనికోద్యోగులై యుండిరి. అర్వాచీన గుప్తరాజయుగమున సామంతులై యందందు చిన్న సంస్థానముల నేలుచుండిరి. గుప్తసామ్రాజ్యము ఛిన్నాభిన్నమైపోయిన వెనుక

1. EP. Ind. XIV, p. 120.

నప్పటి విషమ రాజకీయ పరిస్థితుల నదను జేసికొని స్వతంత్రులై పాలించగడగిరి. అట్టి మౌఖరి రాజకుటుంబములలో నీశానవర్మ దొక్కటి. ఇప్పటి యుత్తర ప్రదేశమందు గంగా గోగ్రా నదుల యంతర్వేదియందుండు జాన్‌పుర బరబంకి మండలములు వీరి యునికిపట్టు. ఈశానవర్మకు ముందు వెలసిన మౌఖరిరాజులు మూడు తరముల వారి పేరులు మనకు శాసనముల మూలమున దెలియవచ్చుచున్నవి. మొదటివాడు మహారాజు హరివర్మ; అతని తరువాతివాడు మహారాజు ఆదిత్యవర్మ; కడపటివాడు మహారాజు ఈశ్వరవర్మ. ఈతని కుమారుడే మన ఈశానవర్మ. ఇతడు శూరుడు; తీరని రాజ్యతృష్ణగలదొర. తన పూర్వులవలె సామంత పదవితో దృప్తిపడక గుప్తరాజులవలె సామ్రాజ్యపదము నాకాంక్షించెను. అప్పటి రాజకీయ పరిస్థితు లతని యుద్యమమునకు దోడ్పడినవి. గుప్తసామ్రాజ్య మూచముట్టుగ విధ్వస్తమై పోగా దానిస్థానమున నల్పరాజ్యములు పొడసూపినవి. దేశాంతరములనుండి వచ్చిన హూణాదిమ్లేచ్ఛ జాతులవారు భారతీయులను జయించి నూతన రాజ్యములను నిర్మించుకొనిరి. వీరి యుద్ధములచే దేశమున శాంతి భద్రతలుచెడి విపరీతపరిస్థితులేర్పడి ప్రజలను గళవళపెట్టినవి. ఈ వైపరీత్య సమయము దనయుద్యమమున కనుకూలపడగా నీశానవర్మ విజృంభించి చుట్టు ప్రక్కల నున్న రాజ్యములను జయించి స్వాధీనపఱచుకొని మహారాజాధిరాజ బిరుదమును వహించి దిగ్విజయార్థమై బయలువెడలెను. ఈ సందర్భమునసె యిత డాంధ్ర శూలిక గౌడులను జయించినది.

ఈశానవర్మ యాంధ్రాధిపతిని జయించితినని చెప్పుకొన్నను నితడాంధ్ర దేశముపై నెత్తివచ్చినట్లగపడదు. లభించిన శాసన సాక్ష్యమునుబట్టి చూడగా నిత డాంధ్రాధిపతిని జయించిన దాంధ్రదేశమునందు గాక వెలుపట వింధ్యాద్రి ప్రాంతదేశములందని తోచుచున్నది. హరహ శాసనమున 'ధారామార్గ వినిర్గతాగ్నికణిక' యనియు, 'వింధ్యాద్రేః పతిరంధ్ర మంధ్రపతినాశంకా పరేణాసితం'[1] అనియు జెప్పియుండుటవలన నాంధ్రరాజు మాళవరాజధానియైన ధారాపురినుండి బయలువెడలెననియును, దాని కుత్తరమునం దెచ్చటనో జరిగిన యుద్ధమునం దతడు పరాజితుడై పాఱివచ్చి వింధ్యాద్రి గుహలలో దాగెననియును జెప్పవలసియున్నది. అగునేని యాంధ్రాధిపతియైన ఇంద్రభట్టారకుడు ఉత్తరాపథమందలి మాళవదేశముపై దండెత్తిపోయెనా ? అట్లు దండెత్తి పోయిన నాదండయాత్రకు గారణమేమి ? యనుప్రశ్నలు సమాధానమును గోరుచున్నవి. ఈపట్టున తుమ్మలగూడెపు తామ్రపట్టిక రెండవ గుదె యందు రెండవ మాధవవర్మను గూర్చిచెప్పిన 'ప్రాగ్దక్షిణాపరాంభోనిధి రేవా సరిత్సలిల వలయ విభూషణాయా భువోభర్తుః' అను వాక్యమును స్మరణకు దెచ్చుకొనదగును. అతని కింతటి మహాసామ్రాజ్యమెట్లు సంప్రాప్తమాయెనో పూర్వప్రకరణమునందు వివరించియున్నాడను. అతని పుత్రుడైన ప్రథమవిక్రమేంద్రవర్మ వాకాటక మహాదేవీ సుతు డగుటయు విష్ణుకుండివాకాటకవంశద్వయాలంకరిష్ణు డగుటయు, నతని జ్యేష్ఠద్వైమాతురపుత్రుడైన మూడవ మాధవవర్మ త్రికూటమలయాధిపతి యగుటయు, ప్రథమ విక్రమేంద్రుని పుత్రుడైన మన ఇంద్రభట్టారకుడు 'విజయాధిగతాశేషచక్రవర్తిక్షేత్రాధిపతి' యగుటయు, నీపట్టున గమనించదగిన విషయములే. ఇందువలన క్రీ.శ. ౬వ శతాబ్దమున విష్ణుకుండిన సామ్రాజ్యము పూర్వదక్షిణపశ్చిమసముద్రములను నుత్తరమున నర్మదానదిని దాకుచుండెనని తెల్లమగుచున్నది. ఈశానవర్మ విజిగీషువై దండెత్తివచ్చుచున్నాడని తెలిసి ఇంద్రభట్టారకుడు నిజ సామ్రాజ్య సంరక్షణకొఱకు మాళవ పర్యంతము దండు నడపుకొనిపోగా నచట వారిరువురికి యుద్ధము సంప్రాప్తమాయెను. ఈ యుద్ధమునం దింద్రభట్టారకు డోడి పాఱెనని హరహ శాసనము చాటించుచున్నది.

1. Corpus Inscriptionum Indicarum III, No. 51, pp. 228-30.

ఇంద్రభట్టారకుడిట్లు పలాయితుడైన పిమ్మట నేమాయెనో తెలియదు; కాని కయ్యము వియ్యమునకు దారితీసెననియు, నంతట నిరుపక్షములవారును సమాధానపడిరనియనుట కవకాశము గలదు. ఈశానవర్మకు శర్వవర్మయను పుత్రుడొకడుగలడు. ఇతడు తండ్రియనంతరము మౌఖరిసామ్రాజ్యమున కభిషిక్తుడాయెను. ఈ శర్వవర్మయొక్క పట్టమహిషి ఇంద్రభట్టారికా మహాదేవి. ఆమె పేరే ఆమె ఇంద్రభట్టారకుని కుమార్తెయని చెప్పక చెప్పుచున్నది. అగుసేని ఇంద్రభట్టారకుడు తన పుత్రికయగు నింద్రభట్టారికాదేవిని యీశానవర్మ పుత్రుడైన శర్వవర్మకిచ్చి యుద్వాహమొనర్చి సంధిజేసికొనెనని చెప్పవలసియున్నది.[1]

ఇంద్రభట్టారకుని కాలమున నడచిన మఱియొక పోరాటము పృథ్వీమూలుని గోదావరీ తామ్రపట్టికలందు వర్ణింపఁబడియున్నది. ఈ సంగర మింద్రభట్టారకుని ఇరువదియైదవ రాజ్యవర్షమున ననగా క్రీ. శ. ౫౭౪-౫ లోనో లేక యంతకు ఇంచుకముందో జరిగెను. ఇంద్రభట్టారకుని కరిగాపులై యుండినరాజులనేకులేకమై యతని యాధిపత్యమును గూలద్రోయ సమకట్టిరి. అప్పుడు జరిగిన తుముల సంగ్రామమున మితవర్మ పుత్రుడైన ఇంద్రాధిరాజు సుప్రతీకనామ గజారూఢుడై తన కభిముఖముగ బోట్లాడుచుండిన కుముదనామ మదద్విపమును జంపి కీర్తిగడించెను. ఈ విషయము సదరుశాసనమునందిట్లు వివరింపబడియున్నది.

"శ్రుతాభిజనవృత్త సమ్పత్ప్రభాభాసురోదార పురుషరత్న ప్రకరనికర ప్రసూతి హేతుప్రఖ్యాత మణలుక్కడి వాస్తవ్యద్విజాత్యన్వయ పయోధిసంభూత శీతరశ్మే రసకృదవాప్త చతుర్దన్త సంగ్రామ విజయస్య మితవర్మణః ప్రియతనయేన సరభస మిన్ద్రభట్టారక సముత్పాటనాభిలాష సముదిత ప్రముదితాశేషనృపతికృతతుములసమరాధిరూఢ సుప్రతీ కానేక పాభిముఖ సమదికుముద ద్విరద నిపాతనాధిగతయశసా శ్రీమదిన్ద్రాధిరాజేన"[2]

పైశాసన వాక్యముల నాధారపఱచుకొని ఈ యుద్ధ విశేషములను చరిత్రకారులు వివరించి యున్నారు. ఇందు పేర్కొనబడియుండు సుప్రతీకకుముదనామద్విపము లీ వివరణమున ప్రాముఖ్యమునకు దేబడినవి. ఈ పేరులుగల దిగ్గజములు రెండు కలవు. సుప్రతీకము ఈశాన్యదిక్కునందు యేనుగు; కుముదము నిర్ఋతి దిగ్భాగమునకు జెందినది. శాసనోక్తద్విపములకు పై దిగ్గజములతో నామసామ్య మొక్కటి తప్ప మఱియెట్టి సంబంధములేకున్నను పరిశోధకులవి యాయా దిక్కుల నుండు ప్రభువులను వారిసైన్యములను సూచించుచున్నవని నిశ్చయించి, యింద్రాధిరాజు సుప్రతీకారూఢుడగుట వలన నతడీశాన్యమునందుండు కళింగ గాంగవంశజుడనియును, నతనిచే కుముదద్విపము చచ్చుటవలన నది నిర్ఋతిదిగ్భాగదేశాధిపతియైన విష్ణుకుండిన ఇన్ద్రభట్టారకుడు దానినెక్కి యుద్ధము సేయుచుండి నిహతుడాయె ననియును దీర్మానించిరి. కాని యీసిద్ధాంత మంగీకార్యముగాదు. శాసనోక్త సుప్రతీకకుముదములవి దిగ్గజముల పేరులుగావు. ఆకాలమునను నటుతరువాతను గూడ యేనుగులకట్టి పేర్లు పెట్టుట వాడుకలో నుండెను. నామసామ్యము కేవలము కాకతాళీయమే. దిగ్గజముల నామములసాదృశ్యము నాధారపఱచుకొని చేసినసిద్ధాంతము గాలిమేడవలె కేవలము మాయా ప్రపంచమునకు జెందినది. ఇక యింద్రాధిరాజు కాళింగగంగ వంశాధిపతి యగునేమొ విచారింతము. ఏ గోదావరీ తామ్రపట్టిక లాతని యునికికి గారణభూతములని చెప్పుచున్నారో

1. Bharatiya Vidya Bhavan's History and Culture of Indian People, Vol. III, Classical Age, pp. 67f.
2. I. A. VI, p. 78, Bom RAS. Vol. XVI, p. 119.

యవియే యాతడు కాళింగుడుకాని గాంగుడుకాని కాడని సాక్ష్యము జెప్పుచున్నవి. ఇతని తండ్రియైన మితవర్మ మణల్కుడి వాస్తవ్యుడనియు, ద్విజాత్యన్వయపయోధిసంభూతశీతరశ్మియనియు నందు చెప్పియున్నది. మణల్కుడియనునది ద్రావిడనామము. అది ద్రావిడదేశములోనిప్పటి చెంగల్పట్టుజిల్లా సైదాపేట తాలూకాలోని మణలి గ్రామమేకాని యన్యముగాదు. అది క్రీ. శ. ౬-౭ శతాబ్దములలో నొకగొప్ప బ్రాహ్మణయగ్రహారము. సింహవిష్ణు చతుర్వేది మంగలమను నామాంతరము దానికప్పుడ చెల్లుచుండెను. మణల్కుడి వాస్తవ్యుడును, ద్విజాత్యన్వయ సంభూతశీతరశ్మి యనగా బ్రాహ్మణుడును, నైనమితవర్మ కుమారుడగు నింద్రాధిరాజు కాళింగగాంగుడెట్లు కాగలడు ? మితవర్మయాయుధోపజీవియైన బ్రాహ్మణయోధుడు; తత్కారణమున నతనికి వర్మాంతనామధేయముగలిగెనని తోచుచున్నది. తండ్రివలె నింద్రాధిరాజును నాయుధోపజీవియైన బ్రాహ్మణశూరుడే. ఇతని నామధేయమందలి 'అధిరాజ' శబ్దము పరిశోధకులను భ్రమపెట్టినది. ఇతడు రాజాధిరాజని భ్రమసి పరిశోధకులు కళింగగాంగ రాజ్యమును ఇతనికి బట్టము గట్టిరి. వాస్తవముగ నిత డధిరాజై యుండిన దానొక యగ్రహారమును బ్రాహ్మణుల కీయదలచి గ్రామసంపాదనార్థము పృథ్వీమూలునివంటి సామాన్య సామంతుని యాచించవలసిన గ్రహచారము బట్టియుండదుగదా. కావున నితని నామధేయములోని యధిరాజ శబ్దము నేతిబీరకాయవంటిదని తోచుచున్నది. మఱియు పరిశోధకులు చెప్పునట్లు ఇంద్రాధిరాజు ఇంద్రభట్టారకునికి ప్రతిద్వంది యనుటయు సంశయగ్రస్తమే. ఏలనగా శాసనమూలమును బరికించిచూడగా నింద్రాధిరాజు ఇంద్రభట్టారకుని జెకలించివేయవలయునను కోరికచే బ్రోత్సాహితులై కోపాటోపముతో సమకూడిన సమస్త రాజకృత తుములయుద్ధమందు విజృంభించిన సుప్రతీక గజమున కభిముఖమైన కుముదనామ ద్విపమును వధించి భువన విస్తారమైన కీర్తిని గడించెనని తెలియుచున్నది. ఇందువలన నితడు యుద్ధమున నెవ్వరి పక్షమునబోరాడెనో తెలియవచ్చుటలేదు. కాని యితడింద్ర భట్టారకుని పక్షమే యవలంబించిపోరెనని తలచుట కవకాశముగలదు. ఇంద్రాధిరాజు నిజమాతాపితృలకు పుణ్యావాప్తి నిమిత్తము గ్రామదానము జేయగోరి పృథ్వీమూలునితో విజ్ఞాపనము జేసికొనగా తాటిపాక విషయములో విళిందిరెజ్జట కంపారు తుకురములను నాల్గు గ్రామములకు మధ్యనున్న చూయిపాకయను గ్రామమును ఉపాధ్యాయకుల సంభూతులును నానాగోత్రములకు జెందినవారైన నలువది యాథర్వణిక బ్రాహ్మణుల కగ్రహారీకరించి యిచ్చెను.[1] పృథ్వీమూలుడు విష్ణుకుండినుల నాశ్రయించిన సామంతరాజు. ఇతనికి విష్ణుకుండిన రాజవంశముతో బంధుత్వముగలదు. విక్రమేన్ద్రభట్టారకుని తుమ్మలగూడెపు తామ్రశాసనమున కాజ్ఞప్తి యితడే. కావున బ్రాహ్మణుల కగ్రహారమిచ్చుట కొఱకొక గ్రామము నిమ్మని ఇంద్రాధిరాజు పృథ్వీమూలు నడుగుట జూడగా వారిరువురికిని మైత్రిగలిగి యుండెనని యెంచుట సబబగును. కావున పృథ్వీమూలుని మిత్రుడతని యజమానుడైన ఇంద్రభట్టారకుని యెడ సుహృద్భావము గలిగి యతని పక్షమున యుద్ధముజేసి యుండుననుట యసంగతముగాదు. ఈ యభిప్రాయము సరియగునేని గోదావరి తామ్రపట్టికలలో వర్ణింపబడి సంగరమునందు ఇంద్ర భట్టారకుని శత్రులకుగాక యతనికే జయముజేకురియుండవలయును.

పైజెప్పిన యుద్ధకాలమునకు దరువాత మఱిరెండు సంవత్సరములు ప్రజాపాలన మొనర్చి ఇంద్రభట్టారకుడు క్రీ. శ. ౫౫౫-౫౬లో దివంగతుడాయెను.

---

1. Bom. Br. RAS, Vol. p. 199.

## రెండవ విక్రమేన్ద్రభట్టారకుడు

(క్రీ. శ. ౫౫౮-౫౭౦)

ఇంద్రభట్టారకుని మరణానంతర మతని జ్యేష్ఠపుత్రుడైన రెండవ విక్రమేన్ద్రుడు రాజ్యాధిపతి యాయెను. 'ప్రకృతి మండలేన శైశవ ఏవారోపిత రాజ్యభారు' డనియును, 'గరిష్ఠశైశవ ఏవ సకల నృపగుణాలంకృతు'డనియును శాసనములందు చెప్పియుండుటచేత నితడు తండ్రి మరణకాల మప్పుడు తరుణవయస్కుడనియును మంత్రివర్గముచే రాజ్యాభిషిక్తుడయ్యెననియును దెలియుచున్నది. ఉత్తమాశ్రయుడను బిరుదనామ మితనికి గలదని,

దీప్తాదిఙ్మణ్డలంవ్యాప్తం యస్యబాలార్క తేజసః
సత్యాశ్రయ సుత(ః)శ్రీమా న్తి? జయ త్యుత్తమాశ్రయః[1] ॥

అను తుమ్మలగూడెపు రెండవశాసన ప్రారంభశ్లోకమువలన దెలియవచ్చుచున్నది. 'సకలభువనాశ్రయ మహనీయగుణు' డని తూండి శాసనమునందు ఇతడు ప్రశంసింపబడి యుండుటచే నితనికి సకలభువనాశ్రయుడను బిరుదముగూడ నుండెనేమోయని శంకించుట కవకాశముగలదు.

రెండవ విక్రమేన్ద్రుని పరిపాలన శాంతముగ సాగలేదు. విదేశదండయాత్రికులవలన దేశమందు గొప్ప సంక్షోభముగల్గినది. ఆ నాడు కాంచీపురపల్లవ సామ్రాజ్యము దాదాపు కృష్ణానదీ పర్యంతము వ్యాపించి యుండెను. రెండవ విక్రమేంద్రుని పూర్వికులు కొందఱు పల్లవులను ధిక్కరించి కృష్ణా దక్షిణతటమున గొంత రాష్ట్రము నాక్రమించుకొనిరి. విష్ణుకుండిన మొదటి గోవిన్దవర్మ పల్లవస్కన్దవర్మనో లేక కుమార విష్ణువునో పాఱదోలి దన్నకడము నాక్రమించుకొనెను. అతని పుత్రుడైన రెండవ మాధవవర్మ పల్లవుల నాంధ్రపథము నుండి సంపూర్ణముగ దఱిమివేయ నుద్యమించి దండెత్తిపోయి వేల్పూరుకడ పల్లవులతో యుద్ధము జేసెను; కానియతడు పల్లవులతోడి యుద్ధమందు విజయమందెనో లేదో తెలియదు. రెండవ విక్రమేన్ద్రునకు సమకాలికుడైన పల్లవనాల్గవ సింహవర్మ తనపూర్వికులు గోల్పోయిన రాష్ట్రమును మరల జయించి స్వాధీనము జేసికొనుటకు విష్ణుకుండినరాజ్యముపై దండువెడలినట్లున్నది. నాల్గవ సింహవర్మ కాంచీపుర పల్లవాధీశ్వరుడైన రెండవ సింహవర్మ యొక్క తమ్ముడగు యువమహారాజ విష్ణుగోపవర్మ మున్మనుమడు. ఇతని తాత తండ్రులగు మూడవ సింహవర్మయు రెండవ విష్ణు గోపమహారాజును కృష్ణా దక్షిణతట తీరాంధ్రదేశమును గాంచీపురపల్లవరాజులకు బ్రతినిధులుగ బరిపాలించుచుండిరి. రెండవ సింహవర్మ మనుమడైన మొదటి నందివర్మ సంతానరహితుడై గతించినపిమ్మట నాల్గవ సింహవర్మ కంచిపల్లవ సామ్రాజ్యమున కంతటికిని అధిపతియాయెను. కావున నితడు రెండవ విక్రమేన్ద్రునకు బ్రబలుడైన శత్రుడే; కాని యితని దండయాత్ర సందర్భమున నడచిన యుద్ధవిశేషములెవ్వియు దెలియరావు. ప్రథమమున విష్ణుకుండినులకు ఘనమైన పరాజయముగలిగి రాజ్యము విచ్ఛిన్నమై పోవునను శంకకలిగెను. కాని యుప్పొంగి వచ్చుచున్న విపన్మహాసముద్రమునకు విక్రమేంద్రభట్టారకుని సామంతులలో నొక్కడైన మూలరాజు

1. 'శ్రీమాఞ్జయత్యుత్తమాశ్రయః' అని యుండవలయును.

చెలియలికట్టవలె నడ్డపడి యధఃపతనమై పోవుచుండిన భర్తృకుల లక్ష్మినుద్ధరించి రాజ్యభ్రంశముగానీ యక కాపాడెను.[1] మూలరాజు మన కపరిచితుడుగాడు. గోదావరీ తామ్రపట్టికలలో నితని యుదంతమును జదివి యున్నారము. అందితడు పృథ్వీమూలరాజని పేర్కొనబడియున్నాడు. అది భిన్ననామముగాదు. అది మూల రాజనామమునకు సంపూర్ణరూపమని యతని కుమారుని కట్టుచెఱువు తామ్రశాసనమువలన విదితమగు చున్నది.[2] అధఃపతనమై పోవుచుండిన తనప్రభువుయొక్క రాజ్యశ్రీని మూలరా జుద్ధరించెనని విక్రమేంద్రుని తుమ్మలగూడెపు తామ్రపట్టికలయందు చెప్పియుండుటవలన నతడు పల్లవసింహవర్మను యుద్ధమున నెదుర్కొని పాఱదోలుటయందు ముఖ్యపాత్ర వహించెనని తోచుచున్నది.

పల్లవ దండయాత్రవలన గల్గిన రాజ్యసంక్షోభము నదనుజేసికొని విష్ణుకుండినుల కరిగాపులై యుండిన సామంతులు కొందఱు స్వతంత్రులగుటకు బ్రయిత్నించిరి. వారిలో దుర్జయవంశ్యుడు పిష్టపుర ప్రాంతమును బాలించుచుండిన పృథ్వీమహారాజు ప్రముఖుడు. ఇతనివి తామ్రశాసనములు రెండు లభించినవి. ఒకటి యితని నలువది యాఱవ వర్షమున వ్రాయించి ప్రకటించిన తాండివాడ తామ్రశాసనము.[3] రెండవది నలువదితొమ్మిదవయేట వ్రాయించి ప్రకటించిన గొలవల్లి శాసనము.[4] రెండును బ్రాహ్మణుల కితడుజేసిన భూదానములను దెల్పుచున్నవి. వీనియందీ పృథ్వీమహారాజు రమ లేక రామకాశ్యపగోత్రజుడైన రణదుర్జయమహారాజు మనుమడనియును విక్రమేంద్రుని పుత్రుడనియును జెప్పియున్నది. విక్రమేంద్ర నామము ప్రాచీనకాలమున తీరాంధ్రమును బాలించిన రాజవంశములలోనెల్ల విష్ణుకుండినులందె కానవచ్చు చుండుటవలనను, నాద్యమునుండి కాకపోయినను ఇంద్రభట్టారకుని కాలమం దిప్పటి విశాఖపట్టణ ప్రాంతము వఱకును గళింగదేశము విష్ణుకుండినుల యేలుబడి క్రిందనుండెననియు వారిశాసనములు దెల్పుచుండుటవలన దుర్జయులు తీరాంధ్రమున కంతటికి నధిపతులై యుండిన విష్ణుకుండినుల కరి గాపులై యుండియుందు రనెడి యూహకల్గుచున్నది. ఈ కారణముననె విష్ణుకుండిన వంశమునకు సామాన్యమైన విక్రమేంద్రనామము దుర్జయవంశావళియందు బ్రవేశించియుండును. విక్రమేన్ద్రుని తరువాత నతని కుమారుడు పృథ్వి తండ్రి పదము నధిష్ఠించి విష్ణుకుండినులను ధిక్కరించి స్వతంత్రుడై నలువది తొమ్మిదేండ్లు పిష్టపురము (పిఠాపురము) రాజధానిగ పశ్చిమకళింగమును బరిపాలించెను. ఇతని రాజ్యకాల పరిమాణ మితని శాసనములవల్ల దెలియు చున్నను నితడెప్పుడు వర్ధిల్లెనో నిశ్చయించి చెప్పుటకువలనుపడదు. ఇతని శాసనములయొక్క లిపి స్వరూపమును బరిశీలించిచూచి శాసనపరిశోధకు లితడు క్రీ. శ. సప్తమ శతాబ్ద ప్రారంభమున వెలసియుండునని తీర్మానించియున్నారు.[5] ఇటీవల బ్రకటితమైన చాళుక్య ద్వితీయ పులకేశి వల్లభుని మారటూరు తామ్ర శాసనమువలన నతడు దన యష్టమరాజ్యమ వర్షమున ననగా క్రీ. శ. ౬౧౬-౧౭ లో గళింగమును గొల్లేటిని

1. See అనుబంధము నెం ౬ రు. పంక్తులు 44-45
ఏ నోద్ధృతా భర్తృకుల స్యలక్ష్మీ రధఃపత న్తీ నయవిక్రమాభ్యాం
ఆజ్ఞాపనాఖ్యాతకుల ప్రసూతః శ్రీమూల రాజః సనృపేషు ముఖ్యః ॥
2 నెం. ౯ రు పంక్తులు 14-15 "పృథ్వీశ్రీమూలరాజః" అని.
3. JOR IX. pp. 188-94; EI XXIII, No. 15, pp. 88 f.
4. EI. XXXV, No. 31, pp. 221.
5. EI. Vol. XXIII, No. 15, p. 88.

జయించి యాక్రమించుకొనెనని తెలియుచున్నది. అతడు చాళుక్యాగమనమునకు ముందేయచట రాజ్యమొనర్చి యుండవలయును. చాళుక్యులు పృథ్వీమహారాజును జయించియే కళింగమును వెంగి నాక్రమించుకొనిరనుట కవకాశముగలదు. అతని ౪౯ వ రాజ్యవర్షము క్రీ.శ. ౬౧౬-౧౭ అగునేని యతడు క్రీ.శ. ౫౬౭-౬౮ లో సింహాసనము నదిష్ఠించి యుండవలయును. ఆ సంవత్సరముననే దక్షిణమునుండి పల్లవరాజు విష్ణుకుండిన రాజ్యముపై నెత్తివచ్చి దేశసంక్షోభము గల్గించినది. విక్రమేంద్రభట్టారకుడు పల్లవులతో సంగ్రామమున బనిగొని యుండగా స్వతంత్రస్థాపన కదియే మంచితరియని యెంచి విక్రమేంద్రభట్టారకుని యధికారమును దిరస్కరించి నిజస్వాతంత్ర్యమును బ్రకటించెను; కాని యది స్థిరముగ నెలకొనకమునుపే విక్రమేంద్రుడు పల్లవసింహవర్మను యుద్ధమున నోడించి పాఱదోలెను. ఇట్లు పల్లవుడు నిహతుడై నిజరాజ్యమునకు దిరిగిపోగా విక్రమేంద్రుడు సైన్యముతో గూడ పృథ్వీమహారాజును శిక్షించుటకు పూర్వాభిముఖుడై కళింగముపై దండునడచెను. పృథ్వీమహారాజుతో నైన యుద్ధములో విక్రమేంద్రభట్టారకుడు విజయుడాయెనని తోచుచున్నది. ఈ విషయమతని ౧౪వ రాజ్యవర్షమునాటి తూండి తామ్రశాసనమువలన నూహ్యమగుచున్నది. విక్రమేంద్రుని యధికారమప్పుడు (అనగా క్రీ. శ. ౫౨౦వ వర్షమున) తూర్పుగోదావరి జిల్లాలోని తుని వఱకు జెల్లుచుండెను. కావున విక్రమేంద్రభట్టారకుడు పృథ్వీమహారాజు కడనుండి యతని రాజధానియైన పిష్టపురమును దత్పరిసర ప్రదేశములను నొడిచికొని స్వాధీనపఱచుకొనియెనని మనమనుకొనవచ్చును.

## నాల్గవ మాధవవర్మ
### (క్రీ. శ. ౫౪౬—౫౯౪)

రెండవ విక్రమేంద్రవర్మకు సంతతియున్నట్లు తెలియరాదు. అతని యనంతరము త్రివరనగర ప్రాంతమును పాలించుచుండిన యతని సన్నిహితజ్ఞాతి నాల్గవమాధవవర్మ విష్ణుకుండిన సామ్రాజ్యమున కధిపతియాయెను. తరువాత నతడు తన రాజధానిని త్రివరనగరమునుండి యమరావతికి మార్చుకొని దక్షిణమునకు వచ్చెను. ఇతడు తనరాజ్యసప్తత్రింశవర్షమున (క్రీ. శ. ౫౮౩) గుద్దవాడి విషయముపైదండెత్తిపోయి కుడావాడ విజయస్కన్ధావారమునందు విడిసియుండి తనవంశవిభూత్యర్థము విలెంబలిగ్రామ వాస్తవ్యుడును వత్సగోత్రజుడునునైన యగ్నిశర్మయనుబ్రాహ్మణునకు దానమిచ్చెను.[1] గుద్దవాడియందితడు యుద్ధము జేయుచుండిన శత్రుడెవ్వడో తెలియదు. ప్రాయశః అతడు దుర్జయ వంశజుడైన పృథ్వీ మహారాజై యుండవచ్చును. మఱియు నీ యుద్ధమున జయమెవ్వరికి చేకురెనో చెప్పుటకువలనుపడదు. విజయమెవ్వరిదైనను యుద్ధము సమాప్తమైనట్లు తోచదు. ఏలనగా నీ మాధవవర్మ తన ౪౮-వ రాజ్యవర్షమున (క్రీ. శ. ౫౯౬) వ్రాయించి ప్రకటించిన పులుంబూరు శాసనమున తాను 'దశశతసకల ధరణీతల నృపతి' నని చెప్పుకొని యున్నాడు. ఈ దశశతసకల ధరణీతల మెద్దియో శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు వివరించియున్నారు. 'దశశతసకల ధరణీతల నృపతిః' అనగా దశశతపరిమితసకల ధరణీతలమునకు అధిపతి. దశశతమన వేయి. ఇతడు పాలించినది వేంగియే. కావున వేంగీరాజ్య పరిమితియే యీ సమాసమున దెలుపబడినది. ఇచ్చట 'వేంగీ

1. Ep. Ind. XVII, pp. 334–37.
2. SII IV. Nos. 1158 and 98.

గ్రామసహస్రకం' 'వేంగీసహస్ర క్షమాధీశ్వరః' అను శాసన వాక్యముల ననుసంధించుకొనవలయును.[1] 'అనగా నీ మాధవవర్మ కాలమున వేంగీరాజ్యము (దశశతము) వేయి. దీనినిబట్టిచూడగా నితడు తన ౪౮-వ రాజ్యవర్షమప్పటికి (క్రీ.శ. ౫౯౬) గాని వేంగిని స్వాధీనపఱచుకొనజాలక పోయెనని తోచుచున్నది. వేంగిని సాధించినపిమ్మట నాల్గవ మాధవవర్మ పూర్వము దనవంశజుల యేలుబడి క్రిందనుండిన పూర్వదేశము ననగా గళింగమును జయించి స్వాధీనపఱచుకొన సమకట్టి దండువెడలి గోదావరినిదాటి యవ్వలిగట్టున స్కంధావార మేర్పఱచుకొని విడిసెను. తరువాతనేమి నడచెనో తెలియదు. ప్రాయశః మాధవవర్మ ఈ దిగ్విజయ యాత్రలో పరాజయమునంది రణమున నిహతుడాయెనని తోచెడిది. ఏలనగా నీ దండయాత్ర జరిగిన వెనుక నితడు జీవించియుండెననుట కెట్టి యాధారమును లేదు. మఱియు జాళుక్య దండయాత్రయప్పుడు గోదావరి కటువైపున కళింగమునకు రాజధానియైన పిష్టపురమును నిటు వేంగి కాయపట్టైన జలదుర్గమగు కొలనును దుర్జయుల క్రిందనుండినవి. వారిని జయించియే ఇమ్మడిపులకేశి ఆ రెండు దుర్గములను స్వాధీనపఱచుకొనియెను. కావున మాధవవర్మ క్రీ. శ. ౫౯౪ లో ప్రాగ్దిశాజైత్ర యాత్రసందర్భమున రణమున నిహతుడాయెననుట సమంజసముగ గన్పట్టుచున్నది. అంతటితో మాధవవర్మ ప్రభుత్వమును విష్ణుకుండినుల చరిత్రమును సమాప్తమగుచున్నది.

నాల్గవ మాధవవర్మ విద్వాంసుడు. ఇతనికి జనాశ్రయుడని బిరుదుకలదు. సంస్కృతమునజనాశ్రయ విరచితమైన ఛందోవిచ్ఛిత్తియను లక్షణగ్రంథ మొక్కటికలదు. ఈ మాధవవర్మయె యాగ్రంథకర్తయని వాఙ్మయవిమర్శకు లభిప్రాయపడుచున్నారు. ఇది సరియకావచ్చును.

మాధవవర్మ మరణము దుర్జయుల యభ్యుదయమునకు గారణభూతమాయెను. అందువలన కళింగముపై పృథ్వీమహారాజుయొక్క యధికారము స్థిరపడుటయేకాక వేంగీ విజయమునకు గూడ దారి యేర్పడినది. మాధవవర్మ గతించిన పిమ్మట వేంగీరాజ్యమును సంరక్షించువారు లేరైరి. కావున పృథ్వీమహారాజు వేంగిపై దండెత్తిపోయి యా దేశమును సులభముగ నాక్రమించుకొనగల్గెను. కాని యతడారాజ్యమును చిరకాల మనుభవింపజాలకపోయెను. క్రీ. శ. ౬౧౬-౧౭ లో చాళుక్య రాజు రెండవ పులకేశివల్లభుడొక ప్రచండసైన్యముతో మహారాష్ట్ర కోసలదేశములమీదుగ నెత్తివచ్చి పృథ్వీమహారాజును యుద్ధమున నోడగొట్టి కళింగ వేంగీరాజ్యములు రెంటిని ఆక్రమించుకొనెను. అంతటితో ప్రారంభమైనది పూర్వ చాళుక్యుల రాచరికము.

## ప్రకరణము ౫

## మతము

మతదృష్టిని పరికించిన విష్ణుకుండినులది సంధియుగమని చెప్పనగును. సాతవాహనులనాడు ఆంధ్రదేశమందంతటను బర్వియుండిన బౌద్ధమతము ఇక్ష్వాకులకాలమున క్షీణింపదొడగినది. ఇక్ష్వాకురాజులు బౌద్ధమతము నాచరించుచు వచ్చినను వారియందనేకులు వైదిక ధర్మపరాయణులని చెప్పవలసియున్నది. అశ్వమేధాది క్రతువుల నొనర్చితిమని తమ శాసనములందు బ్రకటించుకొనిరి. కొందఱు

1. Bhārati, Vol. 7, p. 475-6 fn. 6.

శివాలయములను నిర్మించిరి. రాజులిట్లు వైదికధర్మము నాచరించుచు వచ్చినను రాణివాసమువారు మాత్రము బౌద్ధమతము ననుసరించి పెక్కు స్తూపములను సంఘారామములను నిర్మించుటయేకాక వాని పోషణార్థము భూదానాదులను బుష్కలముగ నొసగినట్లు వారి శాసనములు దెల్పుచున్నవి. ఆనాడు వారి రాజధానియైన విజయపురి బౌద్ధ ప్రపంచముననొక కేంద్రస్థానమై యుండినది. బౌద్ధధర్మమును సకల విద్యలను నేర్పుకొఱ కచట నొకగొప్ప యంతర్జాతీయ విద్యాస్థానముండినది. విష్ణుకుండినుల కాలమున ముందటివలెనే బౌద్ధవైదిక ధర్మములు రెండును బ్రజలచే ననుసరింపబడుచు వచ్చినను వైదికధర్మముయొక్క ప్రాబల్య మతిశయించినది. విష్ణుకుండిన ప్రథమ గోవిందవర్మయు నతనిపట్టమహిషియైన పరమభట్టారికా మహాదేవియు బౌద్ధమతమునందు గాఢాభిమానముగలిగి స్తూపములను విహారములను నిర్మించి భిక్షువర్గమును పోషించిరి. తానుసకలసత్వధాతు త్రాణాయోత్పాదిత మహాబోధిచిత్తుడనని యతడు తన శాసనమునందు ప్రకటించుకొనియున్నాడు. మఱియు నతడు షడభిజ్ఞప్రాతీహార్యదర్శనానుగ్రహజనిత సుగత శాసనాభిప్రసాదుడనియు, మహావిహారప్రతిష్ఠాపనాధిగత అనంత బ్రహ్మపుణ్య సంభారుడనియు నతని వంశజుడైన రెండవవిక్రమేంద్రవర్మయితనిబ్రశంసించియున్నాడు. అతడు నిజపట్టమహిషి పరమభట్టారికా మహాదేవి రాజధాని ఇంద్ర లేక శక్రపురమందు నిర్మించిన మహావిహారమున వసించు చాతుర్దశార్యావరభిక్షుసంఘ పరిభోగార్థము పెణ్కపరునామ గ్రామమును దానముజేసెను. గోవిందవర్మ మనుమడైన మొదటి విక్రమేంద్రుడు పరమ సౌగతుడట. పరమ మహాదేవి నిర్మించిన విహారమునకు నటుతరువాత రెండవ విక్రమేంద్రుడు ఇరుణ్డేరను గ్రామమునొసగెను. బౌద్ధమతము రాజధానియైన శక్రపురమునందేకాక విష్ణుకుండిన రాజ్యమునందితర ప్రదేశములందుగూడ వర్ధిలుచుండినది. పై పేర్కొనిన చాతుర్దశార్యావరభిక్షుసంఘము కొఱకు రెండవ విక్రమేంద్రుని సామంతులలో బ్రధానుడైన పృథ్వీమూలుని పుత్రుడు హరివర్మ గుణపాశపురము నందొక విహారమును గట్టించెను. దాని సంభృత్యర్థము పృథ్వీమూలుడు తాటిపాక విషయాంతర్గతమైన కట్టు చెఱువు గ్రామమును దానముజేసెను.[1]

బౌద్ధమత మిట్లు రాజధానియందును తదితర ప్రదేశములయందును ప్రచారముననుండినను వైదిక ధర్మముదాని నధఃకరించెనని చెప్పవచ్చును. వైదికధర్మము ద్వివిధమైనది. కేవలము వైదికక్రతు నిర్వహణాత్మకమైనదొకటి. శైవసమయసంబంధి మఱియొకటి. క్రత్వాచరణ ముఖ్యముగ బ్రహ్మక్షత్రియ జాతులందే వాడుకయందుండెను. క్రతుకర్తలైన బ్రాహ్మణు లెవ్వరును అప్పటి శాసనములందు పేర్కొనబడియుండలేదు. కాని రాజులనేకులు యజ్ఞాదిక్రతువులను జేసినట్లు తెల్పుచున్నవి. విష్ణుకుండినులలో ద్వితీయ చతుర్థ మాధవవర్మలు క్రతుకర్మను బహుళముగ నెఱవేర్చిరి. రెండవ మాధవవర్మ యగ్నిష్టోమక్రతు సహస్ర యేకాదశాశ్వమేధ, సర్వమేధ, పురుషమేధ, బహుసువర్ణ, వాజపేయ, పౌణ్డరీక, రాజసూయ,యూజ్యద్వాదశీ, ప్రాధిరాజ్య,ప్రాజాపత్యములను యాగములను, నాల్గవ మాధవవర్మ క్రతుసహస్ర యేకాదశాశ్వమేధములొనర్చిరని వారి శాసనములు చాటుచున్నవి. మఱియు వారిరువురును హిరణ్యగర్భ సంభూతులట. వీరిక్రతునిర్వహణ విషయమై చరిత్రకారులు కొందఱు సంశయమును వెలిపుచ్చియున్నారు. మాధవవర్మ నామధారులుమాత్రము యజ్ఞములు సేయుటకును తదితరులు సేయకుండుటకును గారణమేమి?

1. Copper Plate Inscriptions in A.P. Govt. Museum, Hyderabad, Vol. I, pp. 246-248.

ఈ మాధవవర్మలైనను వాస్తవముగ నిన్నియాగములను జేయుట సాధ్యమా ? ఈ ప్రశ్నలకు సమాధానము జెప్పుట సులభముగాదు; కాని విష్ణుకుండినుల కించుక పూర్వులైన ఇక్ష్వాకులును సమకాలికులైన పల్లవ చాళుక్యాది భూపాలురును దామశ్వమేధాగ్నిష్టోమాదిక్రతువులనొనర్చితిమని చెప్పుకొనియుండుట జూడగా నాకాలమున దాక్షిణాత్య రాజ్యములన్నిటను వైదిక క్రతువులు జనాదరణనందియుండెనని తోచుచున్నది.

వైదిక క్రతువులతోపాటు పౌరాణిక దేవతారాధనయు వాడుకయందుండెను. మొదటి గోవిందవర్మ స్తూపవిహారములవలె దేవతాయతనములను నిర్మించెను. వైష్ణవముకంటె శైవమె దేశమందు అధికముగ ప్రచారమునందుండెనని తోచుచున్నది. వైష్ణవ సమయప్రస్తావమెందును గానరాదు. శైవము రాజాదరణకు పాత్రమై యుండెను. విష్ణుకుండినులు దాము శ్రీపర్వతస్వామి పాదానుధ్యాతులమని చెప్పుకొనిరి. ఈ శ్రీపర్వతస్వామి సుప్రసిద్ధశైవక్షేత్రమైన శ్రీశైలమున నెలకొనియుండు మల్లికార్జునస్వామియేయని యెంచి పరిశోధకులు కొందఱు విష్ణుకుండినుల కులదైవము శ్రీశైలమల్లికార్జునుడని వక్కాణించియున్నారు; కాని యిది సంశయాస్పదము. ప్రాచీనకాలమున ఇప్పటి గుంటూరుమండలములోని నాగార్జునకొండకు గూడ శ్రీపర్వతనామము జెల్లుచుండెనని యిక్ష్వాకుల శాసనములవల్ల దెలియుచున్నది. విష్ణుకుండినుల కులదైవమయిన శ్రీపర్వతస్వామి నాగార్జునకొండయందు వెలసియుండిన బుద్ధభగవానుడైనను గావచ్చును. విష్ణుకుండి రాజ్యస్థాపకుడైన మొదటిగోవిందవర్మయు నతని పట్టపురాణియు నతని వంశజులు మఱి కొందఱును బౌద్ధమతాభినివిష్టులగుటను దృష్టియందుంచుకొనిన నిది కేవలమసంగతము గాదని తోచగలదు. శ్రీపర్వతము శ్రీశైలమయినను కాకపోయినను విష్ణుకుండిన రాజ్యము నందన్య శైవక్షేత్రములులేకపోలేదు. రెండవ విక్రమేంద్రుని చిక్కుళ్ల తామ్రశాసనమున భగవత్సోమగిరినాథుడు పేర్కొనబడియున్నాడు. ఈ సోమగిరినాథుడాపేరిటి పర్వతమందు నెలకొనియుండిన పరమేశ్వరుడె కావలయును. రెండవ విక్రమేంద్రుడును నతని తండ్రియైన ఇంద్రభట్టారకుడును పరమ మాహేశ్వరులని పై చిక్కుళ్ల శాసనమందే చెప్పియుండుట చేత సోమగిరినాథుడు శివుడనుట సంగతమే కావచ్చును. పరమ మాహేశ్వరుడనగా దీక్షగొన్న శైవుడు. కావున విష్ణుకుండినుల కాలమున శైవము దేశమందు వ్యాప్తినందియుండెననియు, రాజులుగూడ శైవదీక్షగొని యాసమయము నాదరించి పోషించిరనియు దెల్లమగుచున్నది.

విష్ణుకుండినులు ధర్మనిరతులు. వీరు సనాతన హిందూధర్మమును సంరక్షించిరి. మొదటి గోవింద వర్మ తా ననురక్తవర్ణాశ్రమ స్వజనపరిజనుడనని తన తుమ్మలగూడెపుశాసనమున బ్రకటించుకొనియున్నాడు. ఇందువలన నప్పుడు వర్ణాశ్రమ ధర్మములు వర్ధిలుచుండెననియు, గోవిందవర్మ స్వయము బౌద్ధమతానుయాయియైనను వానిని సంరక్షించి జనానురాగమును బొందెననియు దెలియుచున్నది. విష్ణుకుండినులు బ్రాహ్మణాభిమానముగల ప్రభువులు; వారియందుకొందఱు పరమ బ్రహ్మణ్యులు. వారు బ్రాహ్మణులకు అగ్రహారములనిచ్చి పోషించిరి. ఈవి పుణ్యకార్యమని వారు భావించిరి. భారతీయ రాజధర్మముననుసరించి తమ విత్తమంతయు బ్రజాక్షేమము కొఱకే వెచ్చపెట్టిరి. మొదటి గోవిందవర్మ సర్వస్వత్యాగి; గ్రామక్షేత్ర హిరణ్యాద్వీరద తురగ గోబలీవర్దశయనాసన యానపాన భోజనభాజన భవనవసనాభరణ కన్యాదాసీ దాససహస్రములను దానముజేసిన వదాన్యుడు. న్యాయాధిగతమైన తన విభవధనసముదయము భిక్షుద్విజానాథయాచక వ్యాధిత

దీనకృపణజనోపభుజ్యమానమని యతడు తలంచెను. ప్రజలయుపయోగార్థ మత డనేక దేవతాయతన విహార సభా ప్రపాతటాకోదపానారామముల నిర్మించెను. గోవిందవర్మ వలెనే యతని మునిమనుమడగు నింద్రభట్టారకుడును దానపరుడు. ఇతడు సతత భూమి గోకన్యాహిరణ్య ప్రదాన ప్రతిలబ్ధ పుణ్యాజీవితోప భోగ్యుడని యితని కుమారుడు ద్వితీయ విక్రమేంద్రుడితని గొండాడియున్నాడు. ఇతర విష్ణుకుండినప్రభువులును వీరివలెనే ధర్మపరులై తమ విత్తమంతయు పరోపకారార్థము వెచ్చించియుందురు.

## ప్రకరణము ౬

## విద్యాభిమానము

విష్ణుకుండినృపాలురు విద్యాప్రియులు. వారియందు కొందఱు కవులును, గ్రంథకర్తలును గలరు. మొదటి విక్రమేంద్రుడు మహాకవియట. ఇతడు రచించిన గ్రంథములెవ్వియో తెలియరావు. జనాశ్రయ బిరుదాంకితుడైన నాల్గవ మాధవవర్మ తనపేర జనాశ్రయఛందోవిచ్ఛిత్తియను లక్షణగ్రంథమును వ్రాసెను. వీరివలె కవులుగాకపోయినను తక్కినవారందఱును విద్వాంసులను పోషించి విద్యాభివృద్ధికి కారణభూతులైరి. మొదటి గోవిందవర్మ విద్వాంసులను జేరదీసి వారి నాదరించి వారి గోష్ఠియందు సకలశాస్త్రార్థములను జర్చించువాడు. ఇంద్రభట్టారకుడు ఘటికాస్థానమును స్థాపించి విద్యాభివృద్ధికి దోడ్పడియెను. విష్ణుకుండినులు బ్రాహ్మణులకనేకులకగ్రహారములనొసగిపోషించిరి. అగ్రహారమనగా నగ్రవర్ణమువారికి సర్వకరపరిహారముగ దానమిచ్చిన భూఖండము. అగ్రహారములు బ్రాహ్మణులకు కేవలము జీవనార్థమిచ్చిన భూస్థితులుగావు. వారు సంఘసంస్కృతులకొనర్చు సేవకు బ్రత్యామ్నాయముగ నిచ్చిన జీవితవృత్తులు. యజ్ఞయాగాదులవలన సంతృప్తులైన దేవతలమూలమున వర్షము సకాలమునగురిసి దేశమున పైరు పచ్చలు పెరిగి పండి, ధనధాన్య సమృద్ధి గలిగియుండుననియు బ్రజలు జీడపీడలులేక యాయురారోగ్యాభివృద్ధిగలిగి క్షేమముగ నుందురనియు యప్పటివారి దృఢవిశ్వాసము. యజ్ఞ యాగాదికర్మలను జేయనర్హులు బ్రాహ్మణులయిన కారణమున వారిచే నాకార్యములను పక్రమముగ నిర్వర్తింపజేయుటకొఱకు దేశప్రజాక్షేమముల నపేక్షించిన రాజన్యులు భూవృత్తులనొసగువారు. మఱియు నగ్రహారములను బడసిన బ్రాహ్మణులు స్వయము వేదాధ్యయనము సేయుటయేకాక విద్యార్థులను జేరదీసి వారికుచితముగ నన్నవసనాదులనిచ్చి వేద వేదాంగ శాస్త్రాదులను గఱపవలసియుండెను. కావున బ్రాహ్మణాగ్రహారములన్నియు విద్యాసంస్థలై వైదికవిద్యలను వానితోపాటు వైదికధర్మమును బెంపొందించెడివి.

అగ్రహారములతోపాటు చెప్పదగినవి ఘటికాస్థానములు. ఘటికయననేమి? దీనియర్థమునొక్కొక రొక్కొక్కవిధమున నిర్వచించియున్నారు. డాక్టరు కీల్హారనుగారు ఘటికాగోష్ఠిశబ్దములు సమానార్థకములని వక్కాణించి, ఘటికయనగా బ్రాహ్మణ విద్వాంసుల పరిషత్తని నిర్ధారించిరి.[1] డాక్టరు సి. మీనాక్షమ్మగారది 'పని గొను' 'యత్నించు' అనునర్థముగల 'ఘట్' ధాతుభవమనియు ఘటికయనగా జ్ఞానసంపాదనకై విద్యార్థులు కృషిచేయుస్థానమనియు వచించిరి.[2] ఘటికాశబ్దమెట్లు వ్యుత్పన్నమైనను నది యున్నత విద్యాస్థానమనుట

1. Ep. Ind. VIII, p. 20. n. 1.
2. Administration and Social Life under the Pallavas, pp. 186-7.

నిర్వివాదాంశము. విష్ణుకుండినయుగముననేకాక తరువాతికాలమందుకూడ ఆంధ్రదేశమునను దక్షిణభారత మందన్యప్రదేశములందును ఘటికాస్థానములు వర్ధిలుచుండెనని శాసనములు సూచించుచున్నవి. ఇంద్ర భట్టారక నిర్మితమైన ఘటిక యెచటనుండెనో నిశ్చయించి చెప్పుటకు వలనుపడదు. అది ప్రాయశః విష్ణు కుండినుల రాజధానియైన యమపురరముననె నెలకొనియుండవచ్చును. పూర్వచాళుక్య జయసింహ వల్లభుని కాలమున వేంగిరాజ్యములోని యసనపురమున మఱియొక ఘటికయుండెను.[1] అప్పటి దాక్షిణాత్య ఘటికాస్థానములలోనెల్ల వాసికెక్కినది పల్లవరాజధానియైన కాంచీపురమందుండెను.[2] దీనికే త్రైరాజ్య ఘటికయని నామాంతరము. పల్లవత్రైరాజ్యమునకు రాజధానియగు కంచియందుండుటవలన దానికా నామాంతరము గలిగియుండును. చాళుక్యయుగమునందీ ఘటికాస్థానములు కర్ణాటాంధ్రములందు పెక్కుచోట్ల వర్ధిలుచుండెనని శాసనములు దెల్పుచున్నవి. క్రీ. శ. ౧౧౮౨ నాటి యొక షికార్పూరు శాసనమున కుంతల దేశము ధర్మమునకు మూలస్తంభప్రాయమైన ఘటికాస్థానమునకు నిలయమని చెప్పియున్నది.[3] క్రీ. శ. ౧౦౫౮ నాటి యొకశాసనమునందు ఆహవమల్ల సోమేశ్వరుని దండనాయకుడగు మధుసూదనుడు అఱులు మున్నూటికి తిలకప్రాయమైన నాగవావి యగ్రహారమున ఘటికాస్థానమును స్థాపించినట్లు చెప్పియున్నది.[4] మఱియు క్రీ. శ. ౧౦౭౮ నాటి కర్నూలుమండల శాసనమున సిందవాడి సహస్రమునకు ముఖ్యస్థానమగు తుంబళమహాగ్రహారమందలి ఘటికాస్థాన మాణవపోషణార్థము చాళుక్యచక్రవర్తి భువనైకమల్లదేవుని సోదరుడు జయసింఘదేవుడు కొంత భూమిని విద్యాదానముగ నిచ్చినట్లు చెప్పియున్నది.[5] మఱియు బత్తికొండ తాలూకాలోని కుక్కనూరు గ్రామములోని రామేశ్వర దేవాలయమందొక ఘటికాస్థానముండెనని క్రీ. శ. ౧౧౨౮ నాటి శాసనమొకటి తెల్పుచున్నది.[6] క్రీ. శ. ౧౧౭౮ నాటి యొక యనంతపుర మండలశాసనమున హేమావతి యను నామాంతరముగలహెంజేరుపట్టణమందలి నొణంబేశ్వర మచటి మహా ఘటికాస్థలమునకు జెందినదని వ్రాసియున్నది.[7]

మీద నుదాహృతములైన శాసనములనుబట్టిచూడగా దక్షిణభారతదేశమునందాంధ్ర ద్రావిడ కర్ణాట జనపదములందు ఘటికాస్థానములు క్రీ. శ. ౬వ శతాబ్దమునుండి ౧౨ వ శతాబ్దమువఱకును వర్ధిలుచుండెనని తెలియుచున్నది. వీనిని రెండుతరగతులుగ విభజించవచ్చును. కొన్ని బ్రాహ్మణులకు జెందినవి. మఱికొన్ని శైవులకుజెందినవి. బ్రాహ్మణ ఘటికలు రాజధానులందును నగ్రహారములందును స్థాపితములు. కాంచీపురతుంబళ నాగవావిఘటికాస్థానము లిందు కుదాహరణములు. శైవఘటికలు ప్రాయికముగ శివాలయములందును శైవమఠములందును నెలకొల్పబడియుండెడివి. ఈ ఘటికల విన్యాస మెట్టిదో, యందేయే విద్యలు నేర్పబడు చుండెనో, వాని నిర్వహణ మెట్టిదో, నిర్వాహకులెవ్వరో, వారి యోగ్యత యెట్టిదో మనకు స్పష్టముగ దెలియ

1. EP. Ind. XVIII, p. 56.
2. EP. Ind. VIII, p. 28.
3. EI. VII SK 197.
4. HAS. No. 8, p. 15.
5. AR. No. 514 of 1915.
6. AR. No. 286 of 1935–6.
7. EC. XII Si 23, SII Vol. II, No. 557.

రాదు. ప్రథమజయసింహవల్లభుని నిడుమరు శాసనమున ఘటికాసామాన్యు డొకడు పేర్కొనబడియున్నాడు![1] ఘటికాసామాన్యుడనగా ఘటికాసభ్యుడని యర్థము. అర్వాచీన ఘటికాస్థానములలో వేలకొలది సభ్యులుండినట్లు శాసనములు దెల్పుచున్నవి. ఉత్తర ఆర్కాడు జిల్లాలోని తిరువళ్ల గ్రామమున నందివర్మ పల్లవమల్లుడు తన ౫౨ వ రాజ్య వర్షమున వ్రాయించిన శిలాశాసనము ఘటిక యేడువేలును పేర్కొనుచున్నది.[2] పాశ్చాత్యగాంగ శివమారుని హెల్లిగెఱె తామ్రశాసనమందలి ప్రతిగ్రహీతలలో ఘటికాసహస్రమునకు జెందిన వాశిష్ఠ గోత్రసముద్భూతుడు ఆర్యశర్మ యొక్కడు గలడు.[3] పార్థివేంద్రవర్మనాటి కొన్ని బ్రహ్మదేశపు శాసనములలో మూడువేల త్రైరాజ్య ఘటికామధ్యస్థులు పేర్కొనబడియున్నారు.[4] ఇందువలన త్రైరాజ్యఘటిక త్రిసహస్ర సంఖ్యాకమనియు దానికి సంబంధించిన మధ్యస్థలు కొందఱు గలరనియు దెల్లమగుచున్నది. మధ్యస్థుడనగా నెవ్వడో కనుగొందము. మధ్యస్థుడనగా నిరుపక్షములవారు చెప్పెడి వాదము విని నిష్పక్షపాతముగ దీర్పు చెప్పి కార్యము నెఱవేర్చు వాడని యర్థము. కాని యిచ్చట దీనికీయర్థము జెల్లదనియు సంకేతార్థమేదో కలదనియు దోచుచున్నది. చోళయుగమునాటి ద్రావిడదేశ శాసనములందు మధ్యస్థుల ప్రస్తావముగలదు. వీనిని బరిశీలించి చూడగా వీరు గ్రామకూటముల కొలువున పనిగొనియుండు గ్రామోద్యోగులని తోచుచున్నది. వీరికుద్యోగమిచ్చువారును జీతమిచ్చువారును నుద్యోగమునుండి తొలగింపనర్హులును గ్రామకూట సభ్యులే. గ్రామసభలను సమకూర్చి యందలి కార్యక్రమమును నడపి సభవారి తీర్మానములను వ్రాసియుంచుట వారి నియమితకృత్యము[5]. వీరివలెనే ఘటికామధ్యస్థులుగూడ ఘటికల కొలువుననుండు నుద్యోగస్థులని చెప్పనగును. వీరినుద్యోగమందునియమించువారును, దొలగించువారును, నుద్యోగమందున్నంతకాలమును భృతియిచ్చువారును ఘటికాస్థానమువారే కానగును. ఘటికా పరిషత్తులను సమకూర్చి కార్యక్రమమును నెఱవేర్చి పారిషదుల తీర్మానములను వ్రాసియుంచుట వీరిపనియై యుండును.

ప్రాచీన ఘటికలన్నియు కేవలము బ్రాహ్మణ విద్యాస్థానములు. ప్రాయికముగ నవి రాజులచేత బ్రాహ్మణులకొఱకు నిర్మింపబడినవి. రాజపోషణమువలన నభివృద్ధినందినవి. ఘటికానిర్మాణము పుణ్యకార్యము. ఇంద్రభట్టారకుడు యథావిధి నిర్మాపిత ఘటికావాప్తపుణ్యుడని చిక్కుళ్లతుండి తామ్రశాసనములు ప్రకటించుచున్నవి.కాంచీపురఘటికాస్థానము పల్లవరాజులచేస్థాపించబడెను. వారధికారమందున్న ఐదాఱుశతాబ్దముల కాలమును వారుదానినిపోషించిసంరక్షించిరి. క్రీ.శ. ౪వ శతాబ్దమున సత్యసేనుడను రాజొకడు దాని నాక్రమించుకొనగా స్కందశిష్యుడు వానిని జయించి పాఱదోలి దానిని మరల బ్రాహ్మణుల కొప్పజెప్పెనని వేలూర్పాళెపుదామ్రపట్టికలందు చెప్పియున్నది. రాజసింహుడను నామాంతరముగల రెండవ నరసింహవర్మ తన ధనమంతటిని దేవబ్రాహ్మణ సేవకొఱకే వినియోగపఱచి దేవాలయముల గట్టించి వేదాధ్యాపనము సేయించుట కొఱకు

1. Ep. Ind. XVIII p. 56L : 12
2. SII III, Part III. p. 91.
3. EC III, Md 113.
4. AR Nos. 194 of 1915; 197 of 1915.
5. See Colas II, pp. 305–7.
6. SII, Vol. 2, No. 88, pp. 507 f.

స్వకీయ ఘటికాస్థానమును పునః ప్రకల్పితము జేసెనట.[1] ఇట్లే విష్ణుకుండి రాజులును తమరాజ్యమందలి ఘటిక స్థానములను పోషించియుందురనుటకు సంశయములేదు.

ఘటికాస్థానములందేయే విద్యలను గఱపుచుండిరో వివరించిచెప్పుటకు వీలుగాదు. అవి కేవ బ్రాహ్మణ విద్యాస్థానములని మీదచెప్పియున్నదికదా. కావున నందువైదిక విద్యలు గఱపబడుచుండెనః మనమూహించవచ్చును. బ్రాహ్మణ ఘటికలతోపాటు శైవఘటికలు గూడ నుండెను గదా. వాని మాటయేవి యనుప్రశ్న రావచ్చును. శైవములైనను నవియు బ్రాహ్మణ సంస్థలే. కేవల మర్వాచీనములైన శైవసిద్ధాం లింగాయతాది బ్రాహ్మణేతరసమయముల ప్రస్తావ మీసందర్భమునం దవసరములేదు. ప్రాచీన పాశుప కాలాముఖకాపాలికాదిశైవసమయముల ప్రతిపాదకులందఱును శైవమతానుయాయులైన బ్రాహ్మణులే. వారికి వైదిక విద్యలావశ్యకములే. వారి ఘటికా స్థానములయందును వేదశాస్త్రాదివైదిక విద్యలును వానితో పాటు శైవాగమాదులను నేర్పుచుండిరని మనమనుకొనవచ్చును. ఘటికాస్థానములందు ప్రచారమందుండి విద్యావిధానము శాసనముల మూలమున గొంత విదితమగుచున్నది. తాళగుండ శాసనములో గదంబమయూ శర్మ కాంచీపుర ఘటికాస్థానమున బ్రవచనమును నిఖిలమును నేర్వనిచ్చగలవాడై ప్రవేశించెనని చెప్పి యున్నది. ప్రవచనమనగా వేదములును దత్సంబంధములయిన బ్రాహ్మణారణ్యకములును శిక్షాదిషడ్వేదాం ములునని నిఘంటుకారు లర్థమును నిర్వచించియున్నారు. ఇందువలన నప్పుడు కాంచీపుర ఘటికాస్థానమునన సమకాలికాంధ్ర ఘటికాస్థానములందును ప్రవచనమును సర్వమును నధ్యయనము జేయించుచుండిరని మః మూహించవచ్చును. అర్వాచీన కాలమున కల్యాణి చాళుక్యయుగమున ఘటికాస్థానములందు అధ్యేయ విద్యలు కొన్ని నాగవావిశాసనమునందు సూచింపబడియున్నవి. నాగవావి ఘటికాస్థానమున వేదము నిన్నూర్వు రధ్యయనము సేయుచుండిరి. శాస్త్రముల నభ్యసించుచుండినవారి సంఖ్యయేబది రెండు. వేదములతో పాటు వైదిక విద్యలన్నియు నందునేర్పబడుచుండెనని మనమనుకొనవచ్చును. శాస్త్రములాఱు: న్యాయ వైశేషిక సాంఖ్య యోగమీమాంసా వేదాంతములు. కొందఱు యోగమునకు మారుపాణినీయముననగా వ్యాకరణమును దర్శనముగ గ్రహించిరి. నాగవావి ఘటికాస్థానమున రెండుదర్శనములు మాత్రమ గఱపుచుండినట్లున్నది. ఆ శాసనమున బేర్కొనబడిన న్యాయభాట్ట ప్రాభాకరదర్శనములలో గడపటి రెండున పూర్వమీమాంసాభేదములే. కొన్ని కర్నూలు మండల శాసనములలో నప్పటి కాలాముఖ శైవాచార్యుల నిష్ణాతులైయుండిన శాస్త్రాదులు కొన్ని పేర్కొనబడియున్నవి. క్రీ. శ. 1058 వ నాటి శాసనమునందొక్క దానియందు "కాలాముఖ సరోజరాజహంస" 'లాకుల సిద్ధాంతనైయ్యాయికనళినీదివాకర' 'మల్లికార్జున దే దర్శన కారణ పురుష, బిరుదాంకితుడు సురేశ్వర పండితుడు ప్రశంసింపబడి యున్నాడు.[2] మఱియొ శాసనమునందనేక తర్కాది శాస్త్రపారుగుడైన చంద్రభూషణ పండితుడు కీర్తింపబడియున్నాడు. ఈ శాసనములలో బేర్కొనబడియుండు కాలాముఖలాకులసిద్ధాంతములు భిన్నములుగావు. ఒక్కదాని నామాంతరములే. మల్లికార్జున దేవదర్శన మెద్దియో తెలియదు. ఇది మల్లికార్జున నామధారియైన శైవా చార్యప్రతిపాదితమని తలచెదను. తెలుఁగు కుమారసంభవకర్తయైన నన్నెచోడుని గురువగు శ్రీశై

1. SII. Vol. 2, No. 8, pp. 507 f.
2. AR, No. 677 of 1922-23, 9 of 1928.

మల్లికార్జునముని యితడేకానగును. ఇదియెట్లున్నను పై బేర్కొనిన కాలాముఖులాకుల సిద్ధాంతములన్నియు నప్పటి యాంధ్ర శైవ ఘటికాస్థానములలో నేర్పుచుండియుండవలయును. ఈ యర్వాచీనఘటికా స్థానములలో వాడుకయందుండిన విద్యా విధానము నూతనపరికల్పితముగాదు. ప్రాచీనకాలము నుండియు నవిచ్ఛిన్నముగ బ్రచారమునందుండినదె.

విద్యగఱపుటకు ప్రాచీన ఘటికాస్థానములందెట్టి యేర్పాట్లు గావించియుండిరో తెలియదు. అర్వాచీన కాలమున ఘటికలలో వాడుకయందుండిన యేర్పాట్లవలన వాని స్వభావమును మనమూహించుకొనవచ్చును. చాళుక్య చక్రవర్తి యాహవమల్ల సోమేశ్వరుని కాలమున క్రీ. శ. ౧౦౫౮ నాటి యొక నాగవావిశాసనమునం దచటి ఘటికాస్థాన మందాచరణ యందుండిన యేర్పాట్లిట్లు వర్ణించబడియున్నవి.

> 'ఘటికాశాలలో జదివెడి వేదాధ్యాయు లిన్నూర్గురకును
> శాస్త్రాధ్యాయులేబదియిర్వురకును తదుపాధ్యాయులు ౩;
> భట్ట దర్శనన్యాస ప్రభాకర వ్యాఖ్యాతలు ౩; వేదము చదివించె
> డియుపాధ్యాయులు ౩; ఘటికాస్థాన భాండారికులు ౬; మొ
> త్తము ౨౬౭ మనుజుల అశనాచ్ఛాదనములకును ............
> ౧౦౦ మత్తరులు భూమి ......... ఇందులో భట్టదర్శనము జెప్పువా
> నికి ౩౫ మత్తరులు, న్యాసము జెప్పువానికి ౩౦ మత్తరులు,
> ప్రభాకరము జెప్పువానికి ౪౫ మత్తరులు; భాండాగారికుల
> యందొక్కరికి ౩౦ మత్తరులు; ఘటికా ప్రహారికి (గడియలుకొ
> ట్టు వానికి) ౩౦ మత్తరులు....[1]

ఇందువలన నాగవావి ఘటికాస్థానమందు వేదముల నధ్యయనముచేయించుటకును, శాస్త్రముల జదివించుటకును-ఒక్కొక్క విషయమునకును-ప్రత్యేకముగ నుపాధ్యాయులుండెడివారనియును, మాణవులవలె వారును ఘటికాస్థాన వసతిగృహముననేయుండువారనియు, వారి కశనాచ్ఛాదనములకొఱకు ఘటికాస్థాపకులే తగునేర్పాటుగావించి యుండువారనియు, వారి జీతములకొఱకు భూవృత్తులేర్పఱచబడి యుండెననియు, విద్యార్థుల యుపయోగార్థము పుస్తకనిలయముండెననియు, దానిని సక్రమముగ నడపుటకు భాండాగారికులను నుద్యోగులు నియమింపబడి యుండిరనియు దెలియుచున్నది. మఱియు బ్రతిదినము విద్యాభ్యసనకాలము కొన్ని విభాగములుగ విభజింపబడి నిర్ణీత ప్రణాళిక ప్రకారము పాఠ్యాంశములొక్కొకటియు నొక్కనిర్ణీత విభాజితకాలమున బోధింపబడుచుండెడిది. విభాజితకాలావధిని ఘటికాప్రహారకుడు గంటను మ్రోయించి తెలుపువాడు.

1. HAS, No. 8, pp. 15–16.

నాగవావి ఘటికాస్థానమునందాచారమునందున్న పద్ధతియే విష్ణుకుండి యుగమునను వాడుక యందుండి యుండవచ్చును. అగునేని ఇంద్రభట్టారకుడు దనచే నిర్మాపితమైన ఘటికాస్థానమున నాగవావి మధుసూదనదండాధీశునివలె విద్యార్థులును ఉపాధ్యాయులును నివసించుటకొఱకు వసతిగృహములను అశనాచ్ఛాదనములకును జీవితములకొఱకును భూవృత్తులనేర్పరచి యుండును; సరస్వతీభాండాగారమును నెలకొల్పి దానినడుపుటకు భాండాగారికులను నియమించియుండును. ఇట్టియేర్పాట్లే యప్పటి యాంధ్రదేశమందలి ఘటికాస్థానము లన్నిటియందును ప్రచారమందుండియుండును.

ప్రకరణము ౭

## వాస్తునిర్మాణములు

విష్ణుకుండినుల కాలమున వాస్తువిద్యయు దానితోగూడ శిల్పకళయు నభివృద్ధి నందెను. మొదటి గోవిందవర్మ దేవతాయతనములతోపాటు స్తూపములను విహారములను నిర్మించితినని చెప్పియున్నాడు. ఇతని పట్టపురాణి పరమమహాదేవి ఇంద్రపురమునందొక మహావిహారమును నిర్మించినది. పృథ్వీమూలుని పుత్రుడు హరివర్మ గుణపాశపురమున నొకమహావిహారమును గట్టించెను. కాని యీ కట్టడము లన్నియు నామమాత్రావశిష్టములై పోయినవి. ఈ కట్టడముల స్వరూపమెట్టిదో కనుగొనుటకు సాధ్యముగాదు. చేజెర్లలోని కపోతేశ్వరాలయము విష్ణుకుండి నిర్మాణము గావచ్చును. ఇది గజపృష్ఠాకారముగల్గి చైత్యశాలవలె నున్నది. కపోతేశ్వరాలయ మాద్యమున బౌద్ధ చైత్యాలయమై యుండెననియు దరువాతనది శివాలయముగ మార్పబడెననియు గొందరందురు. కాని యిది సందేహాస్పదము. గజపృష్ఠాకారములుగల ప్రాచీన దేవాలయములాంధ్ర ద్రావిడదేశములందు కలవు. ఇవియన్నియు నాద్యమందు బౌద్ధచైత్యాలయములై యుండెననుటకు దగిన సాక్ష్యములేదు. ఇట్టి కట్టడములు హిందువులకును బౌద్ధులకును సామాన్యమనితలచుట యుక్తము. విష్ణుకుండినరాజుల కాలమునకు జెందినవి కొండలను దొలిచి తీర్చిన గుహాలయములు కొన్ని కలవు. విజయవాడ కుపనగరమైన మొగలురాజపురమందును దత్సమీపమున నించుక పశ్చిమదిశయందు కృష్ణానదీ దక్షిణతటమందుండు ఉండవల్లిగ్రామమునందు గుహాలయములు విష్ణుకుండికల్పితములని వాస్తుశాస్త్రాభిజ్ఞులభిప్రాయపడుచున్నారు. ఈ గుహాలయములు మహారాష్ట్రమందలి కార్లా యజంటా యెల్లూరా గుహాలయము లంతటి పెద్దవి కావు. పనితనముగూడ యంతటి ప్రశస్తమైనది కాదు. శిల్పదృష్టిని చూచిన మొగలురాజాపుర గుహాలయములకంటె నుండవల్లిగుహాలే శ్రేష్ఠతరమైనవని చెప్పదగియున్నవి. కాని యధునాతన జీర్ణోద్ధారకులు సీమెంటురంగుల పూతలతో వానిని ధ్వంసము జేసియున్నారు. వాని పూర్వస్వరూపమును గనుగొనగోరు వారికి ఈ శతాబ్దారంభమునం దార్కియలాజికల్ డిపార్టుమెంట్ వారు తీయించి భద్రపఱచియుండు ఫోటోగ్రాఫిక్ ప్రతిబింబములే శరణ్యములు. విష్ణుకుండిన గుహాలయములను జూచియే పల్లవరాజు మొదటిమహేంద్రవిక్రమవర్మ యదేవిధమున ద్రావిడదేశమందు పెక్కుచోట్ల గుహాలయముల నిర్మించెనని వాస్తువిద్యా విశారదులు అభిప్రాయపడుచున్నారు. కావచ్చును. అగునేని జగత్ప్రసిద్ధినందిన పల్లవశిల్పమునకివియె బీజప్రాయములని యెంచవచ్చును.

---

